# కువలయానందసారము


ఉభయభాషా - సాహిత్యవిద్యాప్రవీణ

బులుసు వేంకటరమణయ్య





ప్రకాశకులు:

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీ

లోన్ స్క్వేర్, మద్రాసు-1

1972





[వెల: రూ. 3-50

*KUVALAYANANDA SARAMU*

BY

**B. VENKATA RAMANAYYA**



*Second Edition 1972*

**Price Rs 3-50**



*Published by*

**R VENKATESWAR & Co.,**
**Loane Square Madras-1.**

*Sole distributors :*

**PRASAD & Co.,**
**Anderson Street, Madras-1.**

**PRINTED AT**
**FREEDOM PRESS,**
**MADRAS-21**

# పండితాభిప్రాయము

బ్రహ్మశ్రీ బులుసు వేంకటరమణయ్యగారు రచించిన భాషా కువలయానందమునఁ గొన్ని పట్టులు చదివితిని. ఇది సంస్కృతగ్రంథమునకుఁ దగిన తెలుఁగుచేఁతగా నున్నది. అలంకారలక్షణములను వీరు స్వయము పద్యరూపమున పరివర్తించి లక్ష్యములను ప్రశస్తములయిన ప్రాచీనాధునికాంధ్రప్రబంధముల నుండి చాలవఱకు సేకరించి చేర్చిరి. ఇట్లు చేయుటచే వివిధము లగు ప్రాచీనాధునికాంధ్రకవుల కవితాప్రభేదములను జక్కఁగాఁ బాఠకులు చవిచూడఁ గల్గుదురు. ఈ గ్రంథము శీఘ్రముగా ముద్రితమై వెలయుఁగాక యని కోరుచున్నాను. ఇది ఆంధ్ర విద్వత్పరీక్షార్థులకును, విద్వాంసులకును బహూపకారకము. అలంకార శాస్త్రగ్రంథము లిప్పుడిప్పుడే తెలుఁగున వెలయుచున్నవి. అందిది ముఖ్యమైన గ్రంథము. సరసముగాను స్పష్టముగాను ఈ పరివర్తన మున్నది. వీ రింకను మఱికొన్ని అలంకారశాస్త్రగ్రంథములను తెలిఁగించి ఆంధ్రసాహిత్యోన్నతికి తోడ్పడుదురుగాక యని కోరుచున్నాను.

మదరాసు
20-7-33

వేటూరి ప్రభాకరశాస్త్రి

# ప్రకాశకుల విజ్ఞప్తి

సంస్కృతాలంకార గ్రంథములలో మహావిద్వాంసులగు అప్పయదీక్షితులవారు రచించిన కువలయానందము సుప్రసిద్ధ మైనది. అలంకారములఁగూర్చి తెలిసికొనఁగోరువారి కది అవశ్య పఠనీయము. అందలి యుదాహృతులు పెక్కు గ్రంథములనుండి గ్రహింపఁబడినవి. ఆ పద్ధతి ననుసరించియే సుప్రసిద్ధ విద్వాంసులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు 'కువలయానందసార' మను పేర దీక్షితులగారి మూలగ్రంథము నాంధ్రీకరించి మా కొసఁగగా మేము 1934-వ సంవత్సరమున ప్రకటించితిమి. పెక్కేండ్ల క్రిందటనే దీనిని మరల ముద్రింపవలసి వచ్చినను కారణాంతరములవలన నేఁటికిఁగాని తిరిగి ముద్రింప మా కవకాశము కలుగలేదు. మా కోరికపయి శ్రీ వేంకటరమణయ్యగారు దీనిని సంస్కరించి, సర్వాధికారములతో మా కిచ్చినందున తిరిగి దీనిని ప్రకటించు చున్నాము. ఆంధ్రసాహిత్యాభిమానుల యాదరాభిమానములు మాకు లభింపఁగలవని మా విశ్వాసము.

మా గ్రంథము లన్నింటికిని ప్రసాద్ అండ్ కో. వారిని విక్రేతలుగా నియమించితి మనియు తెలిసికొనఁగోరుచున్నాము.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కో.

# మనవి

అలంకారములు కావ్యమునకు శోభను గూర్చునవి. అం దర్థాలంకారములు రసమును స్థైర్యము పోషించును. గీర్వాణాలంకారవాఙ్మయమున కేవల మా యర్థాలంకారములను వివరించునది అప్పయదీక్షిత కృతమగు కువలయానందము.

కువలయానందమున నూట యిరువదినాలు గలంకారములు గలవు. అది అలంకారవాఙ్మయము విరివిగ పెరిగిన తరువాత రచియింపఁబడినది. పూర్వాలంకారికుల మతముల సారూప్య వైరూప్యములు నిందు చర్చింపఁబడినవి. అట్టి చర్చ చివరి యిరువదినాలు గలంకారములలో విశేషము. అట నట చర్చ లున్నను మొదటి నూ అలంకారములు మిగుల సుగమములు.

ఈ కువలయానందసారమున కువలయానందములోని తొలి నూ అలంకారములు మాత్రమే వివరింపఁబడినవి. ఇం దలంకారముల లక్షణములు మూలానుసారులు; ఉదాహరణము లనేకములు ప్రాచీనాధునాతన ప్రబంధముల లోనివి; తక్కినవి మూలానువాదములు. వీనికిఁ జెందిన విశేషచర్చలు 'అనుబంధము'నఁ గలవు.

కటికినేని రామయకవి కృతమగు 'కువలయానంద ప్రకాశిక' యొకటి కలదు. అదియు కువలయానందమునందలి

తొలి నూటలంకారములనే వివరించుచున్నది. కాని యథా మూలము. అది ముద్రితముకూడ; కానీ నేఁడు దొఱకదు.

ఆంధ్రవాఙ్మయపోషకులు-ఆనంద ముద్రాలయాధిపతు లీ గ్రంథము నాదరముతో స్వీకరించి, ముద్రించి ప్రచారమునకుఁ దెచ్చిరి. వారి కనంత ధన్యవాదములు.

పండితులకు పరితోషమును, బాలుర కలంకారపరిజ్ఞానమును ఏపాటిదైన సమకూర్పఁగలుగునేని ఈ 'కువలయానందసారము' రచన చరితార్థము కాఁగలదు.

చెన్నపురి<br>౨౦-౬-౧౯౩౪ } బులుసు - వేంకటరమణయ్య



# మలిపలుకు



'కువలయానందసారము' తొలిముద్రణము వెలువడి పెక్కేండ్లయినను ఇప్పటికిఁగాని పునర్ముద్రణమున కవకాశము కలుగలేదు. ప్రకాశకసంస్థయొక్క యాజమాన్యము మాఱినందున నేఁటికైనను ఇట్టి యవకాశము లభించినది.

దీని తొలిముద్రణము వెలువడిన కొన్నియేండ్లకు నా శాస్త్రమిత్రులగు శ్రీ ఆకెళ్ల-శేషాద్రిగారు ఇందలి దోషములను మాత్ర మెన్నుచు విమర్శించి యొక వ్యాసమును 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక' యందు ప్రకటించిరి. పాఠకుల సౌలభ్యమునకై కావించిన విసంధులను, స్వల్పములగు ముద్రణస్ఖాలిత్యములను సైతము పెద్ద తప్పులుగా భావించిరి. ప్రబంధములనుండి గ్రహింపఁబడిన కొన్ని పద్యము లా యా సందర్భములకుఁ దగినట్లు లేవనిరి.

సంస్కృత కావ్యములలో అలంకారములకు శుద్ధముగ ఉదాహరణములు లభించినట్లు తెలుఁగున లభించుట దుర్ఘటము. సాధ్యమగునంతవఱకును పరిశీలించియే పద్యములను స్వీకరించితిని. ఇయ్యది ఆయన విమర్శనకు గుఱియైనను పదిసంవత్సరములకు పైగా మద్రాసు విశ్వవిద్యాలయమునను, కొన్నియేండ్ల పాటాంధ్ర విశ్వవిద్యాలయమునను విద్వత్పరీక్షలకు పఠనీయముగ ఉండినది. శ్రీ శేషాద్రిగారు చూపిన

దోసఁగులలో సవరింపఁదగినవానిని సవరించి యిందు నాకుఁ దోఁచిన మార్పులన్ని సంస్కరణల నాచరించితిని. ఇయ్యది సహృదయామోదమును పొందఁగలదని నా విశ్వాసము.

'కువలయానందసారము' ద్వితీయ ముద్రణము వెలువడుటకు ముఖ్యకారకులయి, నా యం దాదరాభిమానములు చూపి ప్రోత్సాహ మొసఁగిన సంస్థాధిపతులు శ్రీ చివుకుల-ఆదినారాయణయ్యగారి కనేక కృతజ్ఞతాభివందనములు.

34. పురుషోత్తమనగరు
క్రోంపేట, మదరాసు - 44
18-12-1971

బులుసు - వేంకటరమణయ్య.



# కువలయానందసారము



సీ. వేల్పుటింతుల పెన్నెఱివేణికావి
కాసపడి, వ్రాలు తుమ్మెద యాలపించు
గానమున మాఱుమ్రోఁగెడి గౌరిపాద
పంకజము పాపహారమయి పరఁగుఁగాక!

ఆ. ఒండొరుల తపమున కొండొరుల్ ఫలమయి
వెలయుచుండి లోకవితతి కెల్ల
తల్లిదండ్రులగుచుఁ దనరెడి ప్రాక్తన
దంపతులనెపుడు నెదను దలంతు.

## 1. ఉపమ

క. ఉపమానవస్తువునకును
నుపమేయంబునకు నెచట నొప్పగు సామ్యం
బు పరగుచుండు నయ్యది
యుపమ యగునటంచుఁ బలుకుచుందురు విజ్ఞుల్.

ఉపమానమునకును, ఉపమేయమునకును సొగసైన సామ్యమును స్పష్టముగ నిరూపించుట యుపమాలంకారము. వర్ణింపఁబడునది యుపమేయము. వర్ణింపఁబడుదానికి సమానమగునది యుపమానము. అనఁగా ప్రస్తుతమైనది యుపమేయము. అప్రస్తుతమగునది యుపమానము. అలంకారము అన్నియుఁ జమత్కారమును గల్గించునవి. కావున సామ్యము సొగసుగ నుండనిచో నుపమ యలంకారము కాఁజాలదు. ఇందు ఉపమానము, ఉప

మేయము, ఉభయ సాధారణమగు ధర్మము. ఉపమావాచకములగు పోలెన్ - వలెన్ - కైవడిన్ - మొదలగు పదములలో నేదైన నొకటియు [ఈ నాల్గును] ఉండవలెను. ఉదాహరణము—

క. గిరిరాజతనయ కైవడి
సిరి రాజిల వెలయు నీ సుశీల యనుచు నా
గిరికన్య కచటి మానులు
గిరికాసుతనామ మిడి రకిల్చిమ ఫణితిన్.

(వసుచరిత్రము)

ఇందు గిరికాసుత యుపమేయము. పార్వతి యుపమానము. సిరి రాజిల వెలయుట యుభయసాధారణమగు ధర్మము. "కైవడి" అనునది సాదృశ్యవాచకము. ఉపమాసామగ్రి యగు పదార్థచతుష్టయము వాచ్యముగ నున్న యుపమ పూర్ణ యగును. ఇందేది లోపించినను లుప్తోపమ యగును. ఇయ్యది పూర్ణోపమోదాహరణము. లుప్తోపమ కుదాహరణము—

చ. మలయజగంధి యైన మధుమావతియార్పులకమ్మఁదావి చెం
గలువల సౌరభంబునకు గాదిలిచుట్టము, చక్రవాకులం
గలకలనవ్వు దాని చనుకట్టు, విశాల తదీయ నేత్రముల్
తొలకరి క్రొమ్మెఱుంగుసరి కోడులు మిండలు గండుమీలకున్.

(క్రీడాభిరామము)

ఇచటఁ జక్రవాకస్తనములకుఁ గల సామ్యము సుందరముగ నుండుట. నేత్రములకు, విద్యున్మీనములకు గల సాధర్మ్యము చంచలత్వము. ఆ సామ్యము తెల్పుట శబ్దప్రతిపాద్యములు కానందున నిది లుప్తోపమ యగును. ఇట్టి వాచకలోపాది విషయములు తెలియంగలవు.

## 2. అనన్వయము

గీ. ఒక్కదానికే వర్ణ్యతయు నుపమాన
తయును గల్గ ననన్వయంబయి చెలంగు.

ఏదైన నొక్కదానికే ఉపమానత్వము, ఉపమేయత్వము కూడ నిరూపింపఁబడిన నది యనన్వయ మగును. దానితో దానికే సామ్యము చెప్పుట కుదురదుగాన (అన్వయింపదు కావున) అనన్వయ మను నామ మీయలంకారమునకు సార్థకమగుచున్నది. ఇట్టి సామ్యమువలన దానితో సరి యగు వస్తువు వేఱొకటి లేదని తేలుచున్నది. ఉదాహరణము—

క. వారిధికిని వారిధియే
మేరునగంబునకు సాటి మేరునగంబే
నారాయణదేవుకు సరి
నారాయణదేవు గాక నరపతు లెదురా!

(అడిదము సూరకవి చాటువు)

ఇచట సముద్ర - మేరునగ - నారాయణదేవులతో సరిపోల్పఁ దగు వస్త్వంతరములు లేనట్లు వర్ణింపఁబడినది.

---

## 3. ఉపమేయోపమ

గీ. వర్ణ్యత యవర్ణ్యతయు రెండు వస్తువులకె
యమర నది యుపమేయోపమాఖ్య నొందు.

రెండు పదార్థములు పరస్పర ముపమానోపమేయభావమును పొందిన ఉపమేయోపమాలంకార మగును. దాని కిదియు, దీని కదియు సాటి యగునని చెప్పినపుడు, ఈ రెండిటికి సాటి యగు మూఁడవ పదార్థము లేదని తేలును. ఉదాహరణము—

గీ. జలము తారాపథమురీతి వెలయుచుండె,
ఆకసము జలమట్టుల నలరుచుండె,
తారకలు కుముదాకృతిఁ దనరుచుండె,
కుముదములు తారకాకృతిఁ గొమరుమిగిలె.

ఇచట జల మాకాశమురీతి నున్నదని చెప్పినపుడు జలముప మేయము, ఆకాశ ముపమానము నగుచున్నది. ఆకాశము జలమువలె నున్న దనునపుడు జల ముపమానము. ఆకాశ ముపమేయము నగుచున్నది. ఇట్లే తారా కుముదములును పర్యాయముగ నుపమానత్వము నుపమేయత్వమును పొందుచున్నవి

## 4 ప్రతీపము

సీ. ఉపమానవస్తున కుపమేయతను గల్ప
నంబుచేసినఁ బ్రతీపం బదొకటి,

ప్రసిద్ధముగనున్న ఉపమానోపమేయభావమును మార్చి చెప్పుట ప్రతీపాలంకార సామాన్యలక్షణము. లోకమున నుపమానముగఁ బ్రసిద్ధమైనదాని నుపమేయముగఁ జెప్పినఁ బ్రథమ ప్రతీపభేదమగును. ఉదాహరణము—

చ. తనయము నీదుచూడ్కి కెనయౌ నలకల్వయు నీటమున్గె, మో
మునకెన యైనచందురుని బూర్తిగఁగప్పె పయోధరాళి, నీ
నడకపోల్కియౌ నడలతోఁజను హంసలు కూడఁబోయెనో
వనితరో! నీకు నీడయిన వస్తువులైన లభింప వక్కటా!

పతివిరహమునఁ బరితపించు నొక విరహిమాట యిది. ఇచట నుప మేయములుగాఁ బ్రసిద్ధములైన కనుగవ_మొగము_నడక _ ఉపమానములు

గను, ప్రసిద్ధోపమానములగు నల్లకలువ-చంద్రుఁడు-హంసగమనము ఉప మేయములుగను వర్ణింపఁబడి యున్నవి.

అన్యోపమేయలాభా_ప్తిని వర్ణ్యము
నాదరింపక యున్న నది మఱొకటి,

ఉపమానము నుపమేయముగఁ గల్పించి, దానిం బురస్కరించు కొని ప్రసిద్ధోపమేయమును నిరసించుట ద్వితీయప్రతీపభేద మగును.

గీ. సోగకనుగవ కలవని చూచికొనుచు
నెంచరాని గర్వమ్ము వహించ దేల!
కలవు నీకన్నుగవపాటి కళలఁ జెలఁగు
కలువలు సరస్సులం దెల్లకడలయందు.

ఒక సుందరిని వర్ణించు నీ పద్యమున నుపమానములగు కల్వలు ఉప మేయములైనవి. తల్లాభమున నుపమేయమగు కనుగవపట్ల అనాదరము చూపఁబడినది.

వర్ణ్యోపమేయా_ప్తి వర్ణ్యేతరానాద
రంబు చెప్పినఁ బ్రతీపం బదొకటి,

ఉత్కృష్టమగు నుపమేయము లభించుటవలన, ఉపమానమును దిరస్కరించుట మూఁడవ ప్రతీపభేదమగును. ఉదాహరణము—

గీ. దారుణంబుల నేన పెద్దనని తలఁచి
గాలకూటమ నీవేల గర్వపడెదు!
కలవు నీపోలికలుకల ఖలులమాట
లెంతయును సాధుజనులకు హింసఁగూర్ప.

ఇచటఁ గాలకూటముకంటెను దారుణములగు ఖలులమాటలు-ఉప మేయము లభించుటవలన ఉపమానమగు కాలకూటము తిరస్కరింపఁబడినది.

ప్రకృతముతోడ నుపమితినివృత్తి య
న్యమునకు లేదని యనుట యొకటి,

ఉపమానమునకుఁ బ్రసిద్ధోపమేయముతోడి సామ్యమే కుదురదని చెప్పుట చతుర్థప్రతీపభేదము.

గీ. ఉవిద! ఆలింపు మెంత యనుచితమైన
వాదు ముల్లోకములయందుఁ బ్రాఁకినదియొ,
చంద్రుఁడఁట! నీమొగమునకు సరియగునఁట!
పామరులుగారె యిట్టులఁ బల్కువారు!

ఇచట నుపమానమగు చంద్రునకు ఉపమేయమగు వనితాముఖముతో సామ్యము కుదురదని చెప్పఁబడినది.

గీ. అల్లయుపమాన కైమర్థ్యమైన నొకటి
పంచవిధముల నీ ప్రతీపంబు వెలయు.

ఉపమానము చేయు పనిం గూడ నుపమేయమే యొనర్చునపుడు ఉపమానము నిష్ప్రయోజకమని చెప్పుట చివరి ప్రతీపభేదము.

గీ. అతనికీర్తి ప్రతాపంబు లవనిఁ గలుగ
నేల యవి యంచు మదిలోన నెపుడు తలఁచు
నపుడ పరివేషమిషమున నబ్జసూర్య
మండలముల విధాతృండు కుండలించు

(శృంగారనైషధము)

ఇచట నుపమేయములగు కీర్తిప్రతాపములే ఉపమానములగు చంద్రునియొక్కయు సూర్యునియొక్కయుఁ గార్యములగు కాంతిని-వేడిమిని గలుగఁజేయుచుండుటచే, ఉపమానములు నిరర్థకములైనట్లు వర్ణింపఁబడినది. ఇట్టి యలంకార మైదు విధములు. ఇదియు నింతకుఁ బూర్వము చెప్పఁబడిన అనన్వయమును, ఉపమేయోపమయు నుపమాలంకార భేదములే యని కొందఱి మతము. ప్రతీపాలంకారమునందలి చివరి

భేదమున నుపమానాక్షేపము (అనఁగా నుపమానప్రతిషేధము) ఉండుటం బట్టి యిది యాక్షేపాలంకారమగునని మఱికొందఱు తలంచిరి.

---

## ౬. రూపకము

విషయము విషయ్యభిన్నమై వెలసియున్న
విషయితాద్రూప్యయుక్తమై విదితమైన,
గీ. పండితులు రూపకంబని పల్కుదు రది
సమత న్యూనత నాధిక్య సంఘటనను.
నాలు తెఱఁగులు.........

విషయ ముపమేయము. విషయి యుపమానము. ఉపమానోపమేయములం దభేదము కల్పించుట గాని, ఉపమేయమునం దుపమాన తాద్రూప్యముఁ జెప్పుట గాని రూపక మగును. ఉపమానోపమేయములకు భేదమున్నను, తాద్రూప్యమున ఉపమేయమునం దుపమానత్వమే యున్నట్లు వర్ణింపఁబడును. ఉపమేయము ఉపమానరూపమును ధరించినట్లు వర్ణింపఁ బడినందున నిది రూపకాలంకార మగుచున్నది. మీఁదరీతి నిది తొలుత రెండు విధములు,

ఉపమేయ ముపమానసమానమైనట్లుగాని, ఉపమానముకంటెఁ గొంచె ముత్కృష్టముగాఁగాని న్యూనముగాఁగాని యుండునట్లిందు వర్ణింపఁబడును. ఇట్లు రూపక మాఱు విధము లగుచున్నది.

అభేదమున నుపమేయ ముపమానసమానమై యుండుట కుదాహరణము—

ఉ. అక్కట! కౌరవాన్వయమహార్ణవమింకెనునట్లు లోఁచ నిం
దొక్కరుఁడైన కేళివుహితోత్తిమి మేనఁడయ్యె నర్జునుం
డక్కటి దాన చాలుఁదము నిందఱుఁదీవ్రశరాగ్నిఁగాల్పఁజెం
పెక్కినపాండునందనుల యేత్తెఱఁదొల్లియుఁదారెఱుంగరే!
(మహాభారతము)

ఇచటఁ గౌరవాన్వయమునకును సముద్రమునకును భేదము లేనట్లు వర్ణింపఁబడినది. "అర్ణవమువంటి గౌరవాన్వయము" అని యర్థము గ్రహించి యిచ్చట నుపమయే యగునని శంకింపఁ బనిలేదు. ఇంకిపోవుట సముద్రధర్మముగాని, వంశధర్మముకాదు.

అర్ణవముకంటె వంశము తక్కువయని గాని యెక్కువయని గాని చెప్పకుండుటచే నిది సమాభేదోదాహరణ మగుచున్నది.

న్యూనాభేదరూపకమున కుదాహరణము—

ఆ వె. అజుఁడు కనకమందు నంగనలందును
ఉభయగతుల భ్రమల నొదవఁ జేసె;
వానియెడల సక్తి వదలిన యాతఁడు
వరునిమూపుగన్న పురహరుండె.

ఇచట వరునికి, శివునికి భేదములేనట్లు వర్ణింపఁబడినది. కాని వరుఁడు మానవాకృతిఁదాల్చి యుండుట యొకటి తక్కువగఁ జెప్పఁబడినది.

అధికాభేదరూపకమున కుదాహృతి—

గీ. తాపసిని గౌరవించు పితామహుండు
బలిని యాచింపఁబోవని వామనుండు,
మేలుపుట్టఁబు కల్గు త్రిశూలపాణి
ప్రథితగుణయుక్తుఁ డా రాజవల్లభుండు.

ఇచట రాజునకు; బ్రహ్మ విష్ణు మహేశ్వరులకును భేదములేదని చెప్పఁబడినది. బ్రహ్మ భృగువును నిరసించెను. రాజు ఋషులను గౌరవించును; కాన రా జధికుఁడు. ఇట్లే విష్ణుమహేశ్వరుల విషయమునను నూహింపవలెను.

తాద్రూప్యమున సామ్యమున కుదాహృతి—

ఉ. కంటిరె కన్నులార నవకంతునిరూపము! వీనులారఁగా
వింటిరె వానిమాట! లోకవెంబడినైన ననుం దలంచెనే!

అంటివె! 'కృష్ణకృష్ణ' యని! హా శుకమా! పాడఁగంటివీవు; మా
వంటియదృష్ట హీనలకు వానిఁగనుంగొను భాగ్యమబ్బునే!
(రాధామాధవసంవాదము)

ఇచట శ్రీకృష్ణమన్మథులకు భేదము లేదు. కాని కృష్ణునియందు మన్మథత్వ మారోపింపఁబడినది. కావుననే యతఁడు "నవమన్మథుఁ"డని చెప్పఁబడియున్నాఁడు. ఇచటఁ గంతునికంటె కృష్ణునియెడ నాధిక్యము గాని న్యూనత గాని వర్ణింపఁబడియుండలేదు. అందుచే నిది సామ్యమున కుదాహరణమగును.

తాద్రూప్యమునం దాధిక్యమున కుదాహరణము—

గీ. అసితరుచిమించు నా హాలాహాలముకంటె
తెలివెలుఁగుల యీ చంద్రవిషము మించు;
నసితవిష మెల్ల మ్రింగెను హరుఁడు రాహు
వీని మ్రింగియు పోవక వెడలనుమిసె
(కాళిందీకన్యాపరిణయము.)

ఇచటఁ జంద్రునియందు విషత్వ మారోపింపఁబడినది. ఈ చంద్రవిషము ప్రసిద్ధమగు హాలాహలముకంటె వేఱనియు, రాహువు దీనిని మ్రింగియు గళమున నిముడ్చఁజాలక పోయెననియు వర్ణింపఁబడినది. హాలాహలముకంటె నిది యుత్కృష్ట విష మనుటచేత నాధిక్యమున కుదాహరణము కాఁగలదు.

తాద్రూప్యమున న్యూనత కుదాహృతి—

గీ. నాల్గుమొగములు లేని రెండవ విరించి
కరయుగము గల రెండవ మురహరుండు
ఫాలనేత్రము లేనట్టి పార్వతీశుఁ
డనఁగఁ జెల్లుఁ బరాశరునాత్మజుండు.

ఇచట వ్యాసునియందుఁ గ్రమముగ బ్రహ్మత్వము, హరిత్వము, మహేశ్వరత్వము నారోపింపఁబడినవి. "రెండవ విరించి, రెండవ మురహరుఁడు, పార్వతీశుఁడు" అని చెప్పుటచే నిచటఁ దాద్రూప్యము గలదనియు, వదనచతుష్టయము, కరచతుష్టయము ఫాలనేత్రము, లేకుండుటచే నిది న్యూనోదాహరణమనియు తెలియఁగవలెను.

## 6. పరిణామము

...............పరిణామమగుఁ గ్రియార్థ
మై విషయి విషయాత్మత నతిశయిల్ల.

ఏదైన కార్యమున నుపమానము స్వయముగఁ గార్యకారి కాఁజాలక, ఉపమేయముగా మారి కార్యమును సాధించునట్లు వర్ణించుట పరిణామాలంకారమగును. ఉపమేయ ముపమానముగా మారినట్లు వర్ణించుట రూపకమనియు, ఉపమాన ముపమేయముగఁ బరిణమించినట్లు చెప్పుట పరిణామమనియు గమనింపవలెను. ఉదాహరణము—

మ. మనుమున్ పుట్టినకొంతకాల్యమునిడన్ మోదంబువిస్తీర్ణతన్
గొనుపంగోర్కులు క్రేళ్లుత్రిప్పమది మెచ్చుల్ రెప్పలల్లార్పన
త్యనుషంగస్థితి రిచ్చపాటొదవ నయ్యారంబు సంబంధికల్
దనుపంజాచలతాంగిభూసురుఁ బ్రఫుల్లనేత్రపద్మంబులన్.

(మనుచరిత్రము)

ఇచట లతాంగి భూసురుని ప్రఫుల్లనేత్ర పద్మంబులతోఁ జూచెనని వర్ణింపఁబడినది. పద్మములకు వీక్షణ క్రియోపయోగిత్వము లేదు. అది కలుగుటకై యవి నేత్రరూపమున మారినవి. కావున నిది పరిణామ మగును.

## 7. ఉల్లేఖము

క. పెక్కుగతుల నుల్లేఖము
నొక్కపదార్థమునఁ బెక్కురోలి నిలిపినఁ
బెక్కుగతుల నుల్లేఖము
నొక్కఁడె యొకదానఁ గూర్ప నుల్లేఖమగున్.

(1) అనేకవిధధర్మములు గల వస్తువును, తత్తద్ధర్మానుసారముగ ననేకు లనేకరీతులను తలంచుట తొలి యుల్లేఖము. ఉదాహృతి—

గీ. సిరిమగఁడటంచు యువతులు, కలని ద్రోచి
నట్టివాఁడని వృద్ధలు, నమలరూప
విలసితుండని బాలలు దలఁచుకొనుచుఁ
గంసమర్దను జూచిరి కౌతుకమున

ఇచట యువతులచేతను, వృద్ధస్త్రీలచేతను, బాలికలచేతను శ్రీకృష్ణుఁడు పెక్కు రీతుల నూహింపఁబడినట్లు వర్ణింపఁబడియున్నది.

(2) ఒక్కవస్తువు నొక్కఁడే యనేకరీతుల నుల్లేఖించిన నదియు నుల్లేఖాలంకారమగును. ఉదాహృతి—

ఉ. మనసిజ మంత్రఘోషములు మన్మథునానతిమాట లిందిరా
తనయవిలాసహాసములు దర్పకునార్పు టెలుంగు లంగజ
న్మని చదువుల్ మనోభవుని మోహనగీతు లనంగ చారుఖే
లనములు నెల్లదిక్కులఁ జెలంగె మదోత్కటకోకిలధ్వనుల్.
(నృసింహపురాణము)

ఇచట మదోత్కటకోకిలధ్వనులు మన్మథుని మంత్రఘోషములుగను, నానతిమాటలుగను, విలాసహాసములుగను, ఆర్పుటెలుంగులుగను, చదువులుగను, గీతికలుగను ఒక్కనిచేతనే యుల్లేఖింపఁబడియున్నవి. ఆ యుల్లేఖించినవాఁడు కవి.

## 8-9-10 స్మృతి - భ్రాంతి - సందేహములు

క. సాదృశ్యస్మృతి స్మరణము,
సాదృశ్యభ్రాంతి భ్రాంతి సంజ్ఞక మయ్యెన్,
సాదృశ్యంబున సందే
హాదృతి సందేహమగుచు నలరుం గృతులన్.

సాదృశ్యమువలన స్మరణము కల్గుట స్మృతిమదలంకారము. అనఁగా నొకవస్తువుం గనినచోఁ దత్సమానమగు వస్త్వంతరము తలంపునకు వచ్చుట స్మరణమగును. సాదృశ్యమువలన నొకవస్తువునందు వస్త్వంతర భ్రాంతి కల్గుట భ్రాంతిమంతము. సాదృశ్యమువలన "ఇదియా! అదియా!" అని సందేహము కల్గిన సందేహాలంకారమగును.

స్మరణమున (స్మృతి) కుదాహరణము—

గీ. కమలముంగన్న నందమౌ కలువఁగన్న
మెఱుపుగతిఁగన్న నద్దంపు మెఱుఁగుఁగన్న
చంద్రమునిఁగన్నఁ జిగురులచక్కఁగన్న
తలఁపునకు వచ్చు నీరూపు తలిరుఁబోఁడి!

ఇచటఁ గమలాదులం గనినపుడు తత్సదృశములగు కాంతావయవములు, వానివలనఁ గాంతయు స్మృతికి వచ్చునట్లు వర్ణింపఁబడియున్నది. కావున నిది స్మృతిమదలంకారము.

భ్రాంతిమదలంకారమున కుదాహృతి—

సీ. గిరికుంజములఁ గుంజరపుంజమను గాంచి
కంఠీరవంబు లుత్కంఠ నెగయఁ,
బల్వలంబులఁ గిరిప్రవరంబులను గాంచి
నెఱుక రాజులు విందు లెక్కపెట్టఁ,
కడలిమధ్యంబునఁ గాకోలమును గాంచి
జలదేవతలు భీతి సంభ్రమింప,

పదములఁ గువలకానన వాటి యను శంక
నిందిందిరశ్రేణు లెదురుకొనఁగ

గీ. రజతగిరియం దుఁ దాండవారంభరభస
భంగపతితపరశ్లథపాణినిశిత
కంధరారుద్ధగజకృత్తికంఠశంక
ప్రమథులకుఁ దోఁచ సంధకారంబు ప్రబలె.
(భీమఖండము)

ఇచటఁ జీఁకటియందు సింహాదులకు గజత్వాదిభ్రాంతి కలిగినట్లు వర్ణింపఁబడినది కావున నిది భ్రాంతిమదలంకారము.

సందేహమున కుదాహరణము —

శా. నాదంబో కృటిపిక్కటిల్లెదిశలన్ వ్యామృతావ్యాహతా
స్వాదంబై వినవయ్యెడిం బ్రియవయస్యా! వింటివే వట్పదీ
నాదంబో కలకంఠనాదమొ మరున్నారీమణీవల్లకీ
నాదంబో వివరింపరాదు పరమానందానుసంధానమై.
(వసుచరిత్రము)

ఇచట వట్పదీ - కలకంఠ - మరున్నారీమణీవల్లకీనాదములన్నియు నొక్కపోల్కి నుండుటచే, రాజు వినిన నాద మేదో తెలియదని సందేహము వర్ణింపఁబడినది. కాన నిది సందేహాలంకారముగును.

## 11. అపహ్నుతి

సీ. ధర్మనిహ్నవమున్యధర్మార్థమైన శు
ద్ధాపహ్నుతి యటంచు నలరుచుండు[1]
ఇదె యుక్తిపూర్వమౌ హేత్వపహ్నుతి[2] ధర్మ
నిహ్నుతి యొకచోట నిలుపఁగోర్కి

నైనఁ బర్వ స్తయా:[3] అన్యశంకను భ్రాంతి
వారణంబున భ్రాంత్యపహ్నుతియగు:[4]
అన్యశంక కల్గినపుడు యథార్థముఁ
గప్పిన ఛేకమై గణుతికెక్కు.[5]

గీ. కైతవము మిష మొదలుగాఁ గల పదములఁ
చెప్పి వస్తుస్వరూపముం గప్పివేయఁ
గైతవాపహ్నుతి యనంగ ఖ్యాతిఁ జెందు[6]
వెలయు నీ రీతి నిది యాఱు విధములగుచు.

1. వర్ణనీయమగు వస్తువునందలి ధర్మమును గప్పివైచి తత్సదృశమగు వేఱొక ధర్మము వచ్చుట ఆరోపించిన శుద్ధాపహ్నుతి యగును. అపహ్నుతమనఁగా కప్పివేయుట. ఉదాహరణము—

గీ. బొమ్మకా దిది బంగారుబొమ్మగాని
ఇంతికా దిది జాజిపూబంతిగాని
కలికికా దిది మరుని పూములికికాని
భామకా దిది లావణ్యసీమకాని.

(శశాంకవిజయము)

ఇచట ఇంతియందుఁగల కాంతాత్వధర్మమును గప్పి సువర్ణప్రతిమాత్వము, పుష్పకందుకత్వము, మన్మథబాణత్వము, లావణ్యసీమాత్వము అను ధర్మము లారోపింపఁబడి యున్నవి.

2. మీఁది యపహ్నవమే యుక్తిపూర్వకముగఁ జేసిన హేత్వపహ్నుతి యగును. ఉదాహరణము—

గీ. చందురుఁడు కాఁడు వీఁడు ప్రచండుఁడగుట
నర్యముఁడు కాఁడు రాతిరి నైనకతన

కాన మింటను వెల్గు నీ ఖలుఁడు తలఁప
సబ్ధియందలి బాడబ మగుట నిజము

ఇచట మింట వెలుగు చంద్రుఁడు చంద్రుఁడుకాని సూర్యుఁడుకాని కాఁడని చెప్పుటలో యుక్తి చూపఁబడినది. చంద్రునియందు బడబానలత్వ మారోపింపఁబడియుండుట స్పష్టము.

3. ఒక వస్తువుయొక్క ధర్మమును, ప్రస్తుతాతిరిక్తమగు వేరొక స్థలమున నారోపించినఁ బర్యస్తాపహ్నుతి యగును.

గీ. గరళము విషంబుకాదు భార్గవియె కాని
ప్రజ లదేలనో మార్చియే పలుకుచుంద్రు;
విసపుమేతరి సుఖముగా మసలు; లక్ష్మి
ముట్టినంతనె వెన్నుఁడు మూర్ఛఁబొందు.

ఇచట గరళమునందలి విషత్వము నచటఁ గప్పివైచి యిందిరయం దారోపించుటంబట్టి యిది పర్యస్తాపహ్నుతి యగును.

4. ఒక వస్తువునందు వస్త్వంతరభ్రాంతి కల్గగా, దానిం గప్పివైచి యథార్థమును జెప్పిన భ్రాంతాపహ్నుతి యగును.

క. ఇంతీ! పానుపుపైనిద
కంతుఁడు కూర్చున్నవాఁడు కనుగొను మహహా!
కంతుఁ డనంగుఁడు, నీ చెలి
వింతేనా! విజయరాఘవేంద్రుఁడ చెలియా!

(విజయరాఘవేంద్రునిపై చాటువు)

ఇం దొక చెలికత్తె విజయరాఘవేంద్రుని జూచి యతఁడు మన్మథుఁడని భ్రాంతిగాంచెను. మరి యొక చెలికత్తె ఆమె భ్రమను వారించి యథార్థమును దెలిపెను.

5. తమ రహస్యము నెవరైన తెలిసికొనినపుడు, యథార్థమును గప్పిపుచ్చి యేదో యొకరీతిం జెప్పుట ఛేకాపహ్నుతి. ఛేకులనఁగా విదగ్ధులు. వారి నేర్పరితన మచట వ్యక్తమగుటచే నది ఛేకాపహ్నుతి యని చెప్పఁబడుచున్నది. ఉదాహరణము—

తే. పులకలన్నిని గొనఁగూర్చి మోవిఁ గఱచె
సీత్కృతంబుల శిక్షించె - చిగురుఁబోఁడి!
మగనిగూడితి వేమొ?-నీమాట లేమి?
పలుకుచుంటిని హేమంతపవను మహిమ

ఇచట నాయిక మగనిం గూడియున్నను, యథార్థమును గప్పిపుచ్చి చలిగాలివలనఁ బులకాంకురాదికము కల్గెనని చెప్పినది.

6 వ్యాజాదిపదములం బ్రయోగించి ప్రకృతమును గప్పివేయుట కైతవాపహ్నుతి యగును. ఉదాహరణము—

చ. అదరు నవీనభానుకిరణానల మంటినఁగూడుకొన్న పు
ప్పొడికొలం జెల్ల మోసికొనిపోయెడిసంభ్రమ మొప్పఁగంటివే
పడఁతి! భవద్విహారనవపద్మసరఃకుముదాలయంబులన్
వెడలు మిళిందబృందముల వీఁపుపిశంగిమకైతవంబునన్.
(మనుచరిత్రము)

ఇచట వీఁపుయొక్క తచ్ఛవికాంతి కైతవపదమునఁ గప్పఁబడి పుప్పొడికొలం జెల్ల మోసికొనిపోవుట యను ధర్మాంతర మారోపింపఁబడినది. కావున నిది కైతవాపహ్నుతి యగును.

## 12. ఉత్ప్రేక్ష

గీ. ఊహ యుత్ప్రేక్ష యని చెప్పనొప్పు; వస్తు
హేతు ఫలభేదముల మూఁడు రీతు లదియు

వస్తువృత్త మనుక్తమై వరలు; హేతులు
సిద్ధము నసిద్ధము నగుచుఁ జెలఁగుచుండు

ఉపమాన ధర్మము లుపమేయమునందు నుండుటకు వీలగునప్పుడు, అట్టి ధర్మముల ననుసరించి యుపమేయ ముపమానముగ నూహింపఁబడుట ఉత్ప్రేక్ష యగును. వస్తూత్ప్రేక్ష యనియు, హేతూత్ప్రేక్ష యనియు, ఫలోత్ప్రేక్ష యనియు నిది మూఁడు విధములు. ఒక వస్తువును వస్త్వంతరముగా నూహించుట వస్తూత్ప్రేక్ష. అది ఉక్తవిషయమనియు, అనుక్తవిషయమనియు రెండు విధములు. ఉపమేయము శబ్దోపాత్తమైనచో నుక్తవిషయ మగును. అది శబ్దోపాత్తము కానిచో ననుక్తవిషయమగును. హేతువు కానిదానిని హేతువుగ వర్ణించుట హేతూత్ప్రేక్ష యగును. ఇది సిద్ధవిషయమనియు, నసిద్ధవిషయమనియు రెండు విధములు. ఉన్న విషయమును హేతువుగ వర్ణించుట సిద్ధవిషయము. లేని పదార్థమును హేతువుగ వర్ణించినచో నసిద్ధవిషయ మగును. ఫలము కానిదానిని ఫలముగా వర్ణించుట ఫలోత్ప్రేక్ష యగును. అదియును మీఁదిరీతిగ సిద్ధవిషయమనియు, నసిద్ధవిషయ మనియు నిరుతెఁగులై యున్నది. ఇట్టి యుత్ప్రేక్ష యాఱు విధములు.

ఉక్తవిషయ వస్తూత్ప్రేక్ష కుదాహరణము—

మ. తమిఁ బూదీఁగలతూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుం [దూఁగు నా
కొమరుంబ్రాయపుగబ్బిగుబ్బెతలయంఘ్రుల్ చక్కఁగాఁ [జాఁగి మిం
టి మొగంబై చనుదెంచుతీవిఁ గనుఁగొంటే దివ్యమౌనీంద్ర! నా
కమృగీనేత్రలతోడి కయ్యమునకుం గాల్సాఁచులాగొప్పెడిన్.
(కళాపూర్ణోదయము)

ఇచటఁ గోపురముల ప్రాకారముల కల్పితకృత్రిమ యంత్రములు మింటి ముంగంటనై పొంగి చనుచుండుట, నాకస్త్రీనేత్రములతోడి కయ్యమునకుఁ గాల్చాచునట్లుగా నూహింపఁబడినది. ఉపమానోపమేయములు రెండును ధర్మసాదృశ్యమును గల్గియుండుట సుస్పష్టము. ఇచట నుపమేయము శబ్దోపాత్తమై యున్నది.

అనుక్త విషయ వస్తూత్ప్రేక్ష కుదాహరణము—

గీ. సంద్రము తరంగముల ఫేనచందనమ్ము
నరుగఁదీసిన నైవడి నలరె; విధుఁడు
దానిఁ గరముల దిగ్వధూతనువులందుఁ
బూయుచున్నట్లు లెంతయుఁ బొలుపు మిగిలె.

ఇచట సముద్రము తరంగములచే ఫేనమను చందనము నరఁగదీసినట్లుత్ప్రేక్ష చెప్పఁబడినది. ఆ చందనమును చంద్రుఁడు కరములచే దిక్కులను కాంతల శరీరములఁ బూయుచున్నట్లున్నదని యింకొక యుత్ప్రేక్ష కలదు. మొదటిదానిలో ఫేనము తరంగములచే నొడ్డునకుఁ ద్రోయఁబడుట చందనము అరుగఁదీయుట యని యూహింపఁబడినది కాని యా త్రోయుట శబ్దముచేఁ జెప్పఁబడలేదు. కావున నిది యనుక్త విషయమగును. ఇట్లే రెండవ యుదాహరణమున చంద్రకిరణములు దిక్కులందు వ్యాపించుటంజూచి అది దిగంగనా శరీరలేపనమని యూహింపఁబడినది కాని యా వ్యాపనము చెప్పఁబడి యుండలేదు. అందుచే నిదియు ననుక్త విషయమగును. మొదటిదానిలో సముద్రప్రాంతమున ఫేన మెక్కువగ నుండుటయు, రెండవదానిలోఁ జంద్రుఁడు దిక్కులను కాంతిమంతములుగఁ జేయుటయు నిమిత్తములు.

ఉపాత్తవిషయోత్ప్రేక్షయందు ధర్మముతోఁగూడిన విషయము (ఉపమేయము) రెండవ యూహ కలదు. కావున నది 'ధర్మ్యుత్ప్రేక్ష

యగును. అనుక్త విషయోత్ప్రేక్షయందు ధర్మ మాత్రమునందే యూహా నిబంధింపఁబడును. కావున నది ధర్మోత్ప్రేక్ష యనఁబడును.

సిద్ధ విషయ హేతూత్ప్రేక్ష కుదాహరణము—

గీ. పగలు చంద్రుఁడు రాతిరి భాస్కరుండు
లేనికతనము నా ధరాజాని యెల్ల
వేళలందును వెలుఁగుచు విస్తృతమగు
యశమును బ్రతాపమును ధర నలరఁజేసె.

రాత్రి సూర్యుఁడు లేకుండుటయు, పగలు చంద్రుఁడు లేకుండుటయు లోకసిద్ధము. రాజు తన యశస్సును, ప్రతాపమును వెలయఁజేయుట కా లేమి హేతువు కాదు. అట్లు హేతువు కాకున్నను హేతువైనట్లిచట వర్ణింపఁబడినది. హేతువు కానిది హేతువుగా వర్ణింపఁబడినందున నిది హేతూత్ప్రేక్ష యగును.

అసిద్ధ విషయ హేతూత్ప్రేక్ష కుదాహృతి—

గీ. తరుణి! నీ మోము తేటుఁ బొందఁగఁదలంచి
చందురుఁడు నీవు ద్వేషించు సారసముల
తోడ వైరము సాధింపఁదొడఁగెఁ గనుము;
తరమె నీచక్కఁదన మెంచ ధాతకైన!

ఇచటఁ జంద్రుఁడు పద్మములతో వైరము కలిగి యుండుట సహజము! నాయికాముఖకాంతిని బొందఁదలంచి యట్లొనర్పలేదు. లేని కానిని వర్ణించుటచే నిది యసిద్ధవిషయమగును. అట్లు చంద్రుఁడు పద్మములకు శత్రువగుటకుఁగల కారణము తరుణీముఖకాంతి నభిలషించుటయే యని చెప్పఁబడినది. కావున నిది యసిద్ధవిషయహేతూత్ప్రేక్ష.

సిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష కుదాహరణము—

ఆ. సాగరంబునందు జలపూరవృద్ధికై
చందురుండు సతము చంద్రకాంత
శిలలు పుష్కలముగ జలము స్రవింపఁగాఁ
జేయుననుచు నూహసేయుచుందు.

చంద్రుఁడు సముద్రమునందలి జలపూరమును వృద్ధిపఱచుట లోకసిద్ధము. ఆ చంద్రుఁడు చంద్రకాంతశిలలను ద్రవింపఁజేయుట కయ్యది ఫలము కాకున్నను ఫలమైనట్లు ఇచట వర్ణింపఁబడినది.

అసిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష కుదాహరణము—

మ. అలినీలాలక! కంటె చిల్క భవదీయాలాపలీలాప్తి నిం
పలరంగోరి విపక్వదాడిమఫలవ్యాలంబి శాఖాఫల
జ్వాలనావాఙ్ముఖమై తపంబు సవరింపన్ సాఁగె, నేలబ్బెడిం
దలక్రిందైఁ సమాన వాగ్గ్రహణ మేధాశక్తి బింబాశికిన్!
(వసుచరిత్రము)

ఇచట ఫలముగా నూహింపఁబడిన గిరికాలాపలీలాప్తి యసిద్ధము. అది కవి కల్పితముకాని ప్రసిద్ధము కాదు. ఫలము కానిదానిని ఫలముగ వర్ణించుటచే నిచట అసిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష యని యెఱుఁగవలెను.

---

## 13. అతిశయోక్తి

సీ. అగు నుపాపకము సాధ్యవసాయమైన;[1] న
పహ్నుతి యున్న సాపహ్నవ యగు;[2]

అన్యత్వమున్న భేదాఖ్యము[1]; యోగక
ల్పన మయోగమున సంబంధమగును[4];
యోగమందు నయోగయుక్తి యసంబంధ;[5]
మక్రమం బగును గార్యమును హేతు
వొక్కసారిగఁ జెప్ప,[6] నొగిఁ జపలము కార్య
సంసిద్ధి హేతుప్రసక్తి యున్న;[7]
గీ. హేతుకార్యక్రమంబులరీతి మార్చ
నతిశయోక్తి యత్యంతమై[8] యమరుచుండు.

1. పోలికను జూర్చునపుడు ఉపమానోపమేయములను జెప్పవలసి యుండఁగా ఒక్క ఉపమానమునే చెప్పి, ఉపమానోపమేయముల కభేదమును గల్పించుట అధ్యవసాయ మనఁబడును. అది యున్న యతిశయోక్తి రూపకాతిశయోక్తి యని చెప్పఁబడును. ఉదాహరణము—

చ. కరతలపీడనంబునను గందని చక్కని పూలచెండ్లు, క
ప్పురమున రూపునేపు చెడిపోవని పచ్చనినిమ్మపండ్లు, మేల్
పరిమళసంపదం గలిసి వర్ధిలు బంగరుగిండ్లు, నీకు నే
పరమతపంబునం గలిగెఁ బ్రాయము చే ననుఁ బొందఁ గోమలీ!

(వసురాయల చాటువు)

ఇచటఁ గుచము లుపమేయములు. పూలచెండ్లు, నిమ్మపండ్లు, బంగరుగిండ్లు ఉపమానములు. ఉపమేయములగు కుచములఁ జెప్పక ఉపమానోపమేయముల భేదము లేదని గ్రహింపఁబడినందున నిది రూపకాతిశయోక్తి యగును.



2. పైఁది రూపకాతిశయోక్తియం దపహ్నవము కూడ చేర్చి
చెప్పిన నది సాపహ్నవ యనఁబడును.

ఉదాహరణము—

సీ. మౌక్తికవిద్రుమ మధ్యయందునఁ గాక
పుష్పంబుల మధువు పొసఁగుటెట్లు!
కుముదబాంధవుని నడుమఁ గాక యయ్యవి
యర్ణవంబునయందు నలరుటెట్లు!
శంఖమార్గప్రదేశమునఁ గాక యతఁడు
తూరుపు కొండపైఁ దోఁచుటెట్లు!
తొలకరిమెఱుపునందునఁ గాక యద్దియుఁ
గడలికొండ్డులయందుఁ గలుగుటెట్లు!

గీ. మించుబోఁడి నొకప్పుడుఁ గాంచకుండ
ప్రజలు దబ్బర లిట్టులు పలుకుచుంద్రు;
కాని యొకపరి నా తన్విఁ గాంచిరేని
తమ తలంపులు తప్పని తలఁపఁగలరు.

ఇచటఁ గ్రమముగ దంతములు - అధరము - దాని మాధుర్యము - ముఖము - కంఠము - లావణ్యము అను నుపమేయములం జెప్పక యుపమానములనే కవి ప్రతిపాదించెను. మఱియు మధువు పుష్పంబున నుండఁగా, అట్లు లేదని చెప్పి మౌక్తిక విద్రుమములు నడుమనే కలదని యపహ్నుతి కూడ వర్ణితమై యున్నది. ఇట్టి యపహ్నవము లున్నందున నిది సాపహ్నవాతిశయోక్తి యగుచున్నది.

8. ఒక వస్తువు తక్కినవానివలెనే యున్నను, అది వానికంటె వేఱుగా నున్నదని వర్ణించిన భేదకాతిశయోక్తి యగును. ఉదాహరణము—

గీ. కమలపత్రాక్షి వైదగ్ధ్యగరిమ, రూప
సంపదతిశయమును మానసంబునందుఁ
దలఁప నాహా సామాన్యవిధాతృసృష్టి
కంటె భిన్నమటంచు నిక్కముగఁ దోఁచు.

ఇచట నీ స్త్రీసృష్టి సామాన్యబ్రహ్మ సృష్టిలోఁ జేరినదైనను, వానికంటె మేలయినదని వర్ణింపఁబడినది. కావున నిది భేదకాతిశయోక్తి.

4. ఆరీతి సంబంధము లేనిదానియందు సంబంధమున్నట్లు కల్పించి చెప్పుట సంబంధాతిశయోక్తి యగును. ఉదాహరణము—

క. అన్నగరి చెంత యేనుఁగు
గున్నలపై నెక్కి నిక్కి కోయఁగవచ్చున్
మిన్నేటి పసిఁడితామర
లన్నన్ మఱి యేమి చెప్ప నందలికరులన్!

(రాజశేఖరచరిత్రము)

ఇచట నేనుఁగుగున్నలపై నెక్కినను మందాకిని కమలములను గోయుట యసంభవమైనను సంభవమైనట్లు చెప్పఁబడినది.

5. ఏదైన సంబంధమున్నను లేనట్లు చెప్పిన నసంబంధాతిశయోక్తి యగును. ఉదాహరణము—

ఉ. ఆ నగరంబు ప్రోవను దినాధిపుఁడేగుచు దారికడ్డమై
పూనికనున్న కోటఁ గని పోవఁగలేక యిరాఱు మేరులం
దా నటు దిద్దుమారి చనెఁ దథ్యము; కాదని యంటిరేని యా
భానుని ద్వాదశాత్ముఁ డని పల్కఁగఁ గారణ మేమి నిచ్చలున్!

(రుక్మిణీపరిణయము)

ఇచట సూర్యుఁడు కోటపైనుండి పోఁగలిగినను, పోఁజాలనట్లు చెప్పఁబడియుండుట నిది యసంబంధాతిశయోక్తి యగును.

6. కారణము తొలుత, అపిదపఁ గార్యముఁ జెప్పుట లోకసిద్ధము. అట్లుగాక కార్యకారణము లొక్కసారియే నిరూపింపఁబడినచో నక్రమాతిశయోక్తి యగును.

ఉదాహరణము—

గీ. పాటఁజూచిన రిపుసేన పాటఁజూచు
వింటికొలఁగిన రిపురాజి వింటికొలఁగు
వేయునేటికి ? నల పాండవేయుసాటి
వీరుఁ డిల లేఁడు; ప్రతి రఘువీరుఁ డొకఁడె.

(విజయవిలాసము)

శత్రువులను బాణములచేఁ గొట్టిన పిదప వారు వింటికొలఁగుట లోకవిదము. కాని యిచట రాజు వింటి కొలఁగిననే రిపురాజి మరణించెనని యీ రెండును నొక్కసారి (అనఁగా క్రమములేక) జరిగినట్లు వర్ణింపఁబడినది కావున నిది యక్రమాతిశయోక్తి.

7. కారణమునకుఁ బిదప కార్యోత్పత్తి వర్ణింపక, కారణము కాని ప్రసక్తి కల్గినంతమాత్రముననే కార్యము కల్గినట్లు వర్ణించుట చపలాతిశయోక్తి యగును. ఉదాహరణము—

గీ. మన్మథానలతాపంబు మాన్పవేఁడి
చందనముఁ జేర్పఁబూను చంద్రముఖులు
చెలఁది నిట్టూర్పుగాడ్పుల వెచ్చఁదాఁకి
బెరసి యరత్రోవయందె మర్మరములయ్యె.

(శృంగారనైషధము)

విరహపీడితులగువారి శరీరముపైఁ దాపురపుట్టంబు నుంచిన నది మర్మరము లగుట సంభవము. కాని యిచ్చటఁ గారణమగు తచ్ఛరీరము దూరముగ నున్నంతమాత్రముననే కార్యోత్పత్తి యైనట్లు చెప్పఁబడినది.

8. కార్యోత్పత్తిని ముందుగను, కారణమును వెనుకను వర్ణించిన అత్యంతాతిశయోక్తి యగును.

ఉదాహరణము—

తే. పుష్పవతులైన పిదపను బూపపిందె
లేర్పడుట సాజమౌఁగదా యెల్లలతల!
వింత యీ లతకూనకు వెనుకఁగాక
ముందరనె యవి బటువులై పొటమరించె.

(తనూరాయల చాటువు)

ఇచట పిందె లేర్పడుట తొలుతను, పుష్పవతులగుట వెనుకను వర్ణింపఁబడినవి. కావున నిది యత్యంతాతిశయోక్తి.

## 14. తుల్యయోగిత

గీ. ప్రస్తుతములందుఁగాని యప్రస్తుతములఁ
గాని ధర్మము నొకదాని బూని నిల్ప,
ఒనర హితమందు నహితమం దొక్కరీతి
వెలసినం దుల్యయోగితాభిఖ్యఁ జెలఁగు.

కేవల ప్రస్తుతములందుఁగాని, అప్రస్తుతములందుఁగాని ఒక్క ధర్మమునే నిలుపుట తుల్యయోగితాలంకార మగును. అట్లే హితాహితములు రెండిటియెడను భేదము లేక యొక్కరీతినే ప్రవర్తించుటయుఁ దుల్యయోగిత యగును. కేవల ప్రస్తుతముల కుదాహరణము—

గీ. కడలు సంచారపూతముల్ గా నొనర్చి
సంజవేళను విలయంబు చక్కి వచ్చు
చుండెఁ బల్లవతామ్రమై యొప్పుమిగులు
తరణికాంతియు మునిగోమతల్లికయును.

రఘువంశములో — వనమునుండి తిరిగి యాశ్రమమునకు వచ్చు నందినీ ధేనువును వర్ణించు సందర్భమునందలి పద్యమిది.

ఇచట సాయంకాల వర్ణనమున సూర్యకాంతియు, నందినీధేనువును-రెండును ప్రస్తుతములు. వచ్చుచుండుట ఉభయ సాధారణమగు ధర్మము.

అప్రస్తుతముల కుదాహరణము—

ఉ. తక్కక రావు సింగవసుధాధిపుఁ డర్థు కర్థ మిచ్చుచో
దిక్కులలేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రానుఁ జెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుని నెన్నదు భట్ట, దిట్టవై
కుక్కవో నక్కవో పులివో క్రోఁతివో పిల్లివో బూతిపిల్లివో!

(శ్రీనాథుని చాటువు)

ఇచట రావు సింగమహీపాలుఁడు ప్రస్తుతము. కర్ణుఁడు, దధీచి మొదలగు దాత లప్రస్తుతములు. భట్టు మెచ్చుట ఆ యప్రస్తుతములం దన్నిటియందును గల సాధారణధర్మము. కావున నిదియుఁ దుల్యయోగితాలంకార మగును.

హితాహితములందు సమానముగ నుండుట కుదాహరణము—

తే. పరశువున ముక్కలుగఁ గొట్టువానికైన
మధుఘృతంబులఁ బెంచెడి మాన్యుకైన
గంధమాల్యంబు లర్పించు ఘనునకైన
అందఱికి వేపచెట్టు చేఁదయి చెలంగు.

ఇచట వేపచెట్టు తన్ను రక్షించువారిపట్లను, భక్షించువారిపట్లను ఒక్కమాదిరిగనే (చేఁదుగనే) ఉన్నట్లు వర్ణింపఁబడినది.

గొప్పవారలతోడను గొలఁదివారి
సామ్యమును దుల్యయోగితాసంజ్ఞ నొందు.

ఉత్కృష్టగుణములు గలవారితోఁ గొలఁదివారు సమానులని చెప్పుటయుఁ దుల్యయోగితాలంకారము.

ఉదాహరణము—

గీ. సప్తకుల పర్వతంబు, లష్టద్వీపములు
నష్టదిక్పాలకులు నురగాధిపతియు
నీవునుం భూమి ధరియింప నీకుచేత
నియమితు లటంచు నెపుడు నా నిశ్చయంబు.

ఇచట మనుష్యుఁడగు నృపుఁడు భూమిని ధరించుటయందు ఉత్కృష్టములగు సప్తకుల పర్వతాదులతో సమానుఁడని వర్ణితము.

ఈ తుల్యయోగితాలంకారము "సిద్ధి" యని కొందఱి మతము. ప్రఖ్యాతములగు నుత్కృష్టగుణములచే పరస్పర సామ్యమును నిరూపించుటయే సిద్ధి. "బలములచే నీవును, జలములచే సముద్రమును - మీ రిరువురే లోకమున విఖ్యాతులై యున్నారు" అని దాని యుదాహరణముగ జయదేవుఁడు చెప్పియున్నాఁడు.

## 16. దీపకము

గీ. ప్రస్తుతాప్రస్తుతములకుఁ బరగు ధర్మ
తౌల్య మది దీపకంబయి తనరుచుండు.

ప్రస్తుతమునకు నప్రస్తుతమునకుఁ గలిపి ధర్మసామ్యముం జెప్పినచో దీపకాలంకార మగును. మేడపైనుంచిన దీపము మేడకేగాక నప్రస్తుతమగు వీథికిఁగూడ వెల్గు నిచ్చినట్లు, ఇందలి ధర్మము ప్రస్తుతగతమే యైనను, అప్రస్తుతమునందును సమన్వయించును. దీనికి మీఁదఁ జెప్పినరీతి దీపముతోఁ బోలిక యుండుటంబట్టి దీపకాలంకార మను పేరు కలిగినది.

ఉదాహరణము—

ఉ. వాసన లేనిపూవు, బుధవర్గము లేని పురంబు, నిత్య వి
శ్వాసము లేనిభార్య, గుణవంతుఁడుకానికుమారుఁడున్, సద

భ్యాసము లేని విద్య, పరిహాసప్రసంగము లేని వాక్యమున్,
గ్రాసము లేని కొల్వుఁ గొఱగానివి పెమ్మయసింగధీమణీ!
(పెమ్మయసింగరాజుపైఁ జాటువు)

ఇచటఁ గ్రాసములేని కొల్వు ప్రస్తుతము. వాసనలేని పూవు మొదలగునవి అప్రస్తుతములు. కొఱగామి సాధారణధర్మము. కావున నిది దీపకాలంకార మగును.

---

## 16. ఆవృత్తిదీపకము

దీపకావృత్తి యావృత్తిదీపక మగు;
అర్థశబ్దోభయావృత్తి నది త్రివిధము.

దీపము, మనము కోరినదానికే కాక యితరమునుగూడఁ బ్రకాశింపఁ జేయునట్లే పదము లావృత్తింపఁబడి యప్రస్తుతమున సమన్వయించుట ఆవృత్తిదీపక మగును. ఆ యావృత్తి శబ్దావృత్తి యనియు, అర్థావృత్తి యనియు, శబ్దార్థోభయావృత్తి యనియు మూఁడు విధములు.

శబ్దావృత్తి కుదాహరణము—

గీ. జలదమాలికలు మయూరసుచయముల
కమరఁ జేసెడు నుత్కంఠ, మసమశరుఁడు
తలిరుఁబ్రాయపువారి చిత్తంబులకును
నమరఁ జేసెడు నుత్కంఠ మధికముగను.

ఇచట జలదమాలిక లుత్కంఠ మమరఁ జేయు ననియు, మన్మథుఁ డుత్కంఠము నమరఁ జేయు ననియు నొక్కరీతిధర్మమే యావృత్తమై రెండు వాక్యములు చెప్పఁబడినది. శబ్ద మొక్కటియే యైనను ఇచట నర్థములు వేఱగుచున్నవి. నెమళ్ల పక్షమున కంఠము లెత్తఁబడుటయు, యువక హృదయ పక్షమున వేడుకయు నర్థములు. శబ్దసామ్య ముండుటం జేసి యిది శబ్దావృత్తి దీపకము.

అర్థావృత్తి కుదాహరణము—

గీ. జలదమాలిక వృష్టిచేఁ జాతకముల
దప్పి శమియింపఁజేయుఁ, గాంతాధ్వగంత
బాష్పధారలు ప్రియుల ప్రవాసరుచిని
దీపితముఁ జేయు నీ వానకాలమందు.

ఇచట శమింపఁజేయుటయు, దీపితముఁ జేయుటయు లేకుండఁ జేయుటనే తెల్పుచున్నవి. కాని పదములు మాత్రము వేఱు. అర్థము లింకావృత్తము లగుట నిది యర్థావృత్తిదీపక మగుచున్నది.

శబ్దార్థోభయావృత్తి కుదాహరణము—

గీ. నీ మొగంబున కోడిన నీరజంబు
లధికమగు లజ్జ నీరములందు మునిఁగె,
చందురుఁడు నోడి వెలవెలఁ గందుకొనఁగ
మొయిలుచాటున నల్లదె మునిఁగెఁ గలికి!

ఇచటఁ బద్మములు నీటియందు మునిఁగెననియు, చంద్రుఁడు మేఘములలో మునిఁగెననియు వర్ణింపఁబడినది. ఇచట మునుఁగుట యను శబ్దమును, మునుఁగుట యను నర్థమును ఆవృత్తము లగుటచేత నిది యుభయావృత్తిదీపక మగుచున్నది.

పైఁది యుదాహరణములం బట్టి చూచినచో కేవల వర్ణ్యములకుఁ గాని, కేవలావర్ణ్యములకుఁ గాని సామ్యమును నిరూపించినట్లు స్పష్టమగుచున్నది. ఇది దీపకాలంకారభేదము కాజాలదు. అందొకటి ప్రస్తుతము, వేఱొకటి యప్రస్తుతము నగును. కాని దీనికి ఆవృత్తిదీపకమని పేరిడుటలో నొక కారణము కలదు. దీప మొక్కటియే ప్రస్తుతాప్రస్తుతములను రెండింటిని ప్రకాశింపఁజేయునట్లిందలి క్రియ యొక్కటే యావృత్తమై పదార్థద్వయమునకు నన్వయించుచున్నది.

## 17. ప్రతివస్తూపమ

గీ. ఏకసామాన్య మెంచటఁ బ్రత్యేకముగను
మలయు నది ప్రతివస్తూపమ యనఁబరఁగు.

సదృశములగు వాక్యములకుఁ బరస్పరము వేర్వేఱుగ సామ్యమును నిరూపించుట ప్రతివస్తూపమాలంకారము. ప్రతివస్తువునకును ధర్మము వేఱుగ శబ్దోపాత్తమై యుండుటంబట్టి దీని కీ నామము కలిగినది.

ఉదాహరణము—

సీ. మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు పోవునే మదనములకు!
నిర్మలమందాకినీ వీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు!
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు!
పూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు!

గీ. అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరులఁ జేరనేర్చు!
వినుతగుణశీల మాటలు వేయునేల!

(భాగవతము)

ఇచటఁ గల వాక్యము లన్నింటియందును "పోకుండుట" యను ధర్మమొక్కటియే ప్రత్యేకముగ వేర్వేఱు పదములచేఁ జెప్పఁబడినది. కావున నిది ప్రతివస్తూపమ.



## 18. దృష్టాంతము

వెలయునేని బింబప్రతిబింబభావ
మమరు నయ్యది దృష్టాంతమనఁగఁ గృతుల.

ఉపమానధర్మము, నుపమేయధర్మము వేర్వేఱయినను, ఒకదాని కింకొకటి సాటి యగుటవలన నభిన్నములుగ భాసించుట బింబప్రతిబింబభావ మనఁబడును. ఆ భిన్నధర్మములు రెండును శబ్దోపాత్తములై యుండవలెను. అట్టి బింబప్రతిబింబభావము గల యలంకారము దృష్టాంతమగును.

ఉదాహరణము—

చ. జలజిని శీతభానుకరసంగతిచే వికసింపనేర్చునే!
వెలయఁగ నా కుముద్వతి రవిద్యుతివేఁడిమి నుల్లసిల్లునే!
నెలకొని పాఱు నిర్ఝరిణి నీరధి చేర్పడి వాసిపోవునే!
నిలుకడ తప్పి సీత యతినీచపువృత్తికి వేడ్క సేయునే!

(భాస్కరరామాయణము)

ఇం దుపమేయము సీత; నీచవృత్తికి వేడ్క సేయకుండుట అను ధర్మము. ఉపమానములు తామర, కలువ, నదియును. చంద్రకిరణములచే వికసింపకుండుట, సూర్యుని వేఁడిమి కోర్వఁజాలకుండుట, నీరధిని విడిచి పోకుండుటయుఁ గ్రమముగ వాని ధర్మములు. ఉపమానోపమేయధర్మము లిచట వేఱయినను చంద్రకిరణములచేఁ బద్మమెట్లు వికసింపలేదో, కలువ సూర్యుని వేఁడిమి నెట్లుల్లసిల్లదో, నది సముద్రమును విడిచి యెట్లుండదో, ఆ రీతిని సీత నీచవృత్తికి వేడ్క సేయదని పరస్పర సాదృశ్యము చూపఁబడినది. కావున నిది దృష్టాంతాలంకారము.

## 19. నిదర్శన

గీ. సదృశవాక్యపదార్థైక్యసంఘటనము
వెలయుచుండు నిదర్శనాభిఖ్య నొంది.

ఉపమానములగు వాక్యార్థములకుఁ గాని పదార్థములకుఁ గాని పరస్పరము భేదము లేనట్లు వర్ణించుట నిదర్శనాలంకార మగును. ఉపమేయపదార్థము నుపమానపదార్థము నభిన్నమైనట్లును, ఉపమేయవాక్యార్థము నుపమానవాక్యార్థము నొక్కటియే యైనట్లును వర్ణించుట నిదర్శన యగు నని తేలినది. వాక్యార్థవృత్తి కుదాహరణము.—

అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాధ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడసద్
గంధంబుల్ హరిభక్తివర్జితులరిక్తవ్యర్థసంసారముల్.

(భాగవతము)

ఇచట నంధునకుఁ జంద్రోదయము మొదలగునవి యుపమానములు. హరిభక్తివర్జితుల రిక్తవ్యర్థ సంసారము లుపమేయములు. ఈ యుపమానోపమేయవాక్యార్థముల కిచట - అంధేందూదయాదులే రిక్తవ్యర్థసంసారము అని యభేదము చెప్పఁబడి యున్నది. కావున నిది వాక్యార్థవృత్తి నిదర్శన యగును. పదార్థవృత్తి నిదర్శన కుదాహరణము—

ఉ. ఎంతతపంబుచేసి జనియించినవారొకో! మర్త్యభామినుల్
కాంతుఁ డవజ్ఞ చేసినను కాయము వాయుదు, రే నమర్త్యనై
చింతల వంతలం జివికి సిగ్గఱితిన్, మృతి లేని నాదు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యె నక్కటా!

(మనుచరిత్రము)

ఇచట నుపమేయమగు వధూటిని చెలువును, నుపమానమగు శశికరయా మభిన్నములని వర్ణితములు. అవి పదార్థములే యగుట నిది పదార్థవృత్తి నిదర్శన యగును.

ఈ పదార్థవృత్తి నిదర్శన లలితోపమ యగునని జయదేవుఁడు చెప్పియున్నాఁడు. బింబప్రతిబింబభావయుక్తమగు ధర్మముతోఁ గూడిన దానికి నైక్యము నిరూపించిన వాక్యార్థవృత్తినిదర్శన యగుననియు, ఉప మానోపమేయములలో నొకదానియందు వేఱొకదాని ధర్మము నారోపిం చుట పదార్థవృత్తి నిదర్శన యగుననియు నెఱుంగునది.

స్వక్రియను మంచి చెడ్డలఁ జాటుచున్న
వెలయు నదియు నిదర్శనాఖ్య మగుచు.

ఏదేని యొక పని చేయుచున్నవాఁడు తన పనిచేతనే యితరులకు మంచి చెడుగు స్థితిగతులను బోధించుటయు నిదర్శన యగును.

మంచిం గూర్చి చెప్పుట కుదాహరణము —

గీ. ఉదయపర్వత మాదిత్యు నొప్పమీఱ
వాదల ధరించి తెల్పు గృహస్థుఁ డెపుడు
నతిథులే తేర వారల నధికగౌర
వాంచితసపర్యఁ బూజింపవలె నటంచు.

ఇచట నుదయాద్రి సూర్యుని తన శిఖరమునఁ దాల్చుచు, తా కార్యమువలన గృహస్థు అతిథిని బూజింపవలయునను మంచిని బోధించుచున్నట్లు వర్ణింపఁబడినది. కావున నిది సదర్థనిబంధన యగు నిదర్శన యగును.

చెడుగుం గూర్చి చెప్పు నిదర్శన కుదాహృతి —

గీ. అల్పుఁ డున్నతస్థానము నందెనేని
తిరిగి పతితుఁ డగుననుచుఁ దెలుపుచుండె

శైలశిఖరానఁ బడిన పృషద్గణంబు
చారుమారుతవిధుతినైం జారుచుండె.

ఇచట జలబిందువులు పర్వతశిఖరమునుండి క్రిందికి జారుచు, అల్పుఁడున్నతస్థానముఁ జేరినచోఁ దిగి పతితుఁడగును అని చెడుగు కూడదని బోధించుచున్నట్లు వర్ణింపఁబడియున్నది.

వాక్యార్థపదార్థవృత్తినిదర్శనలు రెండును అసంభవద్వస్తునిబంధన యనియు, మూఁడవదగు సదసద్విషయ నిబంధనయగు నిదర్శన సంభవద్వస్తునిబంధన యనియుఁ గొంద రందురు. అది యుక్తముగ నున్నది. మీఁది యుదాహరణములలోఁ దొలిదానియందలి వాక్యార్థములు రెండు నొక్కటి కాఁజాలవు. అంధేందూదయమునకు, హరిభక్తివర్జితుని రిక్తవ్యర్థసంసారమునకు నెన్నఁడును ఐక్యము కలుగదు. అచట సంసార మంధేందూదయమువంటిదని చెప్పఁబడెను. అట్లే పదార్థవృత్తి నిదర్శనయందును పదార్థములగు తరుణీసౌందర్యదీపికల కభేదము కలుగఁజాలదు. అచట దీపికవంటి సౌందర్యమని చెప్పఁబడియున్నది. సదసన్నిబంధన యగు నిదర్శనయందు మాత్రము తనపనిచేఁ బరులకు హితాహితప్రవృత్తినివృత్తులను బోధించుట కుదురఁగలదు. కావున నది సంభవద్వస్తు నిబంధన యగును.

---

## 20. వ్యతిరేకము

గీ. వెలుఁగు వ్యతిరేకమగుచు విశేషమున్న
వర్ణ్యమున నవర్ణ్యముకంటె వర్ణనమున.

ఉపమానముకంటె నుపమేయమునం దేదో విశేషమున్నట్లు వర్ణించిన వ్యతిరేకాలంకార మగును.

ఉదాహరణము—

ఉ. తామసవృత్తి లేదు; సతతంబును నుగ్రుఁడు గాఁడు; పౌరుషం
బేమియు వార్తి లేదు; తన కెందును పైమటి రాజు లేఁడు; సం
గ్రామములోన నొక్క నరుగాసికి వానిఁ దొలంగఁ; డీశ్వర
క్ష్మామహిళామనోహరుని సాటియె యీశ్వరుఁ డెన్ని భంగులన్?

(పారిజాతాపహరణము)

ఇచట నీశ్వరుఁ డుపమానము. ఈశ్వరక్ష్మాపాలుఁ డుపమేయము. ఉపమానమునందుఁ దామసవృత్తి - ఉగ్రత - పౌరుషమున వార్తి - తనపైని రాజు - ఒక్క నరగాసికి వానిఁదొలఁగుట కలవు; ఉపమేయమునం దట్టివి లేవు; కావున నది యుత్కృష్టముగ నిచట వర్ణితమై యున్నది. ఉపమేయమున విశేషముండుట నిది వ్యతిరేకము.

---

## 21. సహోక్తి

జనుల రంజించు సాహిత్యసంఘటనము
కృతులఁ బరగు సహోక్తియై చతురఫణితి.

సాహిత్యమనఁగా నొకటొకదానితోఁ గూడియుండుట. అయ్యది జనరంజకముగ వర్ణింపఁబడు నేని సహోక్తి యగును.

ఉదాహరణము—

గీ. తమము దఱెఁ జాంధజన మోహతమముతోడ,
వహ్ని వెలుఁగొందె మరుశౌర్యవహ్నితోడఁ
దారకలు తెల్విఁగనె నభిసారికాప
రంపరలతోడ నెంతయుఁ బెంపుమీఱి.

(కవిజనరంజనము)

ఇచటఁ దమఃప్రభృతులకు నాహారమునకు కొదవలగుటవానితోడి పోలిక పొగడఁ జెప్పఁబడినది. కావున నిది సహోక్తి యగును.

## 22. వినోక్తి

గీ. హైన్యమైనను రమ్యతయైన లేమి
వలనఁగల్గ వినోక్తియై వరలుచుండు.

ఒకటి లేదని వర్ణించిన వేఱొకదానికి (ప్రస్తుతమునకు) హీనత గాని, రమ్యత గాని కలిగిన వినోక్తి యగును.

హీనత్వము కల్గుట కుదాహరణము—

గీ. సౌరభము లేని యుట్టి పువ్వుంబువోలె
గందుగోయిల వెలియైన కానవోలె
నధిప! దమయంతితోడి సఖ్యంబు లేని
నీదుసౌందర్య విభవంబు నిష్ఫలంబు.

(శృంగారనైషధము)

ఇచట దమయంతితోడి సఖ్యము లేని నలుని సౌందర్యవిభవము నిష్ఫలమైనట్లు వర్ణింపఁబడినది. ఇందు హీనత్వముండుట సుస్పష్టము.

రమ్యత్వము కల్గుట కుదాహరణము—

క. మాటలఁ దేనియ తేటలు
గాటపువిసము హృదిఁగల్గు ఖలజనములకున్
జోటీయక యుండుటచే
నీటగు నీసభ వెలుఁగు నిర్మలకీర్తి!

ఇచట రాజు ఖలులకు చేర్పకుండుటచే వర్ణ్యుఁడగు నతని సభ శోభఁ జెందెనని రమ్యతయే వర్ణింపఁబడినది. కావున నిదియు వినోక్తి యగును.

## 29. సమాసోక్తి

ప్రస్తుతమున నప్రస్తుతవర్ణనంపు
స్ఫూర్తి యున్న సమాసోక్తి పొలుపుమిగులు.

ఒకచో వర్ణింపఁబడిన ప్రస్తుతవృత్తాంతమునందలి విశేషణములఁబట్టి యప్రస్తుతవృత్తాంతము స్ఫురించినచో సమాసోక్తి యగును. సమాసమనఁగా సంక్షేపము. ఉక్తి యనఁ బ్రస్తుతాప్రస్తుత వృత్తాంతములఁ జెప్పుట. ఇందు సంక్షేపముగాఁ బ్రస్తుతాప్రస్తుతవృత్తాంతములు చెప్పఁబడుటచే నిది సమాసోక్తి యని యన్వర్థనామము కలిగి యున్నది.

ఉదాహరణము—

గీ. పూటపూట శరత్కోటి పొడముకతన
విన్ననై యున్న దీ కన్య వేణిఁ దూల
సన్నగిలియున్నగతి నెన్నఁబడును యకట!
యూర్మికలు కంకణాకృతి నొనర నపుడు.

(వసుచరిత్రము)

ఇచట గిరికాదేవి విరహవర్ణనము ప్రస్తుతము. ఆమె కొకపూట కోటి సంవత్సరములుగఁ దోఁచుచున్నదనియు, జడ వీడినదనియు, సన్నగిలియున్నదనియు, ఉంగరములు కంకణము లయినవనియుఁ బ్రస్తుతోక్తయుక్తములగు విశేషణములు. అవి శ్లిష్టములగుటచేత పూటపూటకు శరత్కాలము సమీపించుచున్నదనియు, కావున ప్రవాహము తగ్గినదనియు, తరంగములు కంకణములుగ మారిపోయినవనియు అప్రస్తుతమగు శరత్కాల నదీవృత్తాంతవర్ణనము తెలియఁజేయుచున్నవి. ఇచటఁ గన్యాశబ్దమునందలి స్త్రీత్వమునకుఁ గన్యానది యను నప్రస్తుతార్థము స్ఫురించుచున్నది. కావున నిది శ్లిష్టవిశేషణ సమాసోక్తి యనబడు.

కాని యిట్లు విశేషణములు శ్లిష్టములై యుండవలెనను నియమము లేదు. విశేషణములు ప్రస్తుతాప్రస్తుత సాధారణములైనవి గాని, సమాన రూపము గలవి గాని కావచ్చును.

విశేషణము లుభయసాధారణములగుట కుదాహరణము—

ఉ. చేరువతోఁటయందు వికసించిన మావులపూవుతావు లిం
పార వహించుచు న్మధువు లానుచు సోలుచు, మెల్ల మెల్ల సం
చార మొనర్చుచుం గదిసి చయ్యన జార్చె సమీరబాలుఁ డా
పేరవరంపునీలనిభ వేణుల గుబ్బలమీఁది పయ్యెఁటల్.

(ఒక చాటువు)

ఇచటఁ బిల్లవాయువు వీఁచుటను వర్ణించుట ప్రస్తుతము. సమీరబాల కర్తృకమగు కామినీవిలాసవృత్తాంత మప్రస్తుతము. ఇచటి విశేషణములు ప్రస్తుతాప్రస్తుతములందు సమానముగ సమన్వయించుచున్నవి. ఇయ్యది యుభయ సాధారణము అగుట స్పష్టము.

విశేషణములు సారూప్యముఁ బొంది యుండుట కుదాహరణము—

ఉ. పూర్వపుటేఁటిపాయలిటు బొత్తిగ నెండుచు లంక వెట్టఁగన్
సర్వమహీరుహంబులును సాంద్రతఁ గోల్పడ నూఁటి కొక్కటై
నేర్వఁ దరంబె యీ వనము నేఁటిది నాఁటిదెయంచుఁ గాని, యీ
పర్వతమున్న హేతువున బాగుగ నే నిది గుర్తుపట్టితిన్.

(ఉత్తరరామచరిత్రము)

ఇచట వనాదివర్ణనము ప్రస్తుతము. ఒక కుటుంబము ధనసంతానాభివృద్ధిఁ బొందుటయు, లేకుండుటయు ననురీతి మార్పులచే మాఱి

పోయిన గ్రామ నగరాది వృత్తాంత మప్రస్తుతము. అది యిట గమ్యము. ఈ రెంటికిని గల సంబంధ మొకదానితో నింకొకటి సరిపోల్చఁదగి యుండుట.

## 24. పరికరము

గీ. పరగుఁ బరికరమయి యభిప్రాయగర్భి
తములగు విశేషణంబులు తనరియున్న

విశేషణము లభిప్రాయ గర్భితములై ప్రయోగింపఁబడినఁ బరికరాలంకార మగును.

ఉదాహరణము__

ఉ. తరుణి, యనన్యకాంత, నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముచేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్.

(మనుచరిత్రము)

ఇచటఁగల విశేషణములు - తరుణి - అనన్యకాంత - క్రూరుఁడు - మహీసురాధముఁడు - అనునవి అభిప్రాయ గర్భితములు. "తరుణి" యనుటచే యౌవనవతియైయున్న వరూథినిని తిరస్కరించుట అనుచితమనియు, "అనన్యకాంత" అనుటచే తన్నే నమ్మికొని యున్నదానిని విడుచుట తప్పనియు, "క్రూరుఁడు" "అధముఁడు" అనుటచేఁ బ్రవరుఁడు నిర్దయుఁడు నరసికుఁడనియు - నీ రీతి అభిప్రాయము లెన్నంగవలెను. అభిప్రాయగర్భితములగు విశేషణము లుండుటంబట్టి యిచ్చటఁ బరికరము.

## 27. పరికరాంకురము

పరికరాంకుర మగు నభిప్రాయగర్భి
తమ్మగు విశేష్యమెంచ్చుటఁ దనరుచుండు.

విశేష్య మభిప్రాయగర్భిత మగునేని పరికరాంకురాలంకార మగును.

ఉదాహరణము—

మ. హరుఁడంకంబున ముద్దుచేసితను బాలార్కాంగఁదన్మస్తకాం
తరవిన్యస్తమృగాంకరేఖ బిససూత్రంబంచు లో శంకనొం
ది రతిం దుండము సాచిపట్టితివియన్ దీకొన్న దానోల్లస
త్కరిరాజాస్యుఁడు మత్ప్రబంధమునకుం గావించు నిర్విఘ్నముల్.

(నారసింహపురాణము)

ఇచటఁ గరిరాజాస్యుఁడను విశేష్యపద మభిప్రాయగర్భితమై యున్నది. వినాయకుఁడు తన తుండమున గొనద్రుంప విలాసమునే యుచటఁ జెప్పఁబడుటచేఁ దదుచితమగు విశేష్యము మాత్రము కలదు. వినాయకుఁడని గాని [illegible] గాని విశేష్యముండిన రసవంతము కాదు.



## 28. శ్లేష

గీ. శబ్దములకు నానార్థసంశ్రయత యున్న
శ్లేషయనెడి యలంకృతి చెలఁగుచుండు;
నదియు వర్ణాశ్రయం బవర్ణాశ్రయ ముభ
యాశ్రయంబని భేదత్రయంబు నొందు.

అనేకములగు నర్థముల నిచ్చు శబ్దములఁ గూర్చుట శ్లేష యగును. అది ప్రకృతమనియు, నప్రకృతమనియుఁ, బ్రకృతాప్రకృతమనియు మూఁడు విధములు. శబ్దములవలనఁ గల్గు నర్థద్వయమును ప్రస్తుతమయ్యేని ప్రకృతవిషయశ్లేష యగును. ఆ యర్థము లప్రస్తుతములైనచో నప్రకృతవిషయశ్లేష యగును. ఒకయర్థము ప్రస్తుతమై రెండవది అప్రస్తుతమయ్యేని ప్రకృతాప్రకృత విషయశ్లేష యగును.

ప్రకృత శ్లేష కుదాహరణము—

గీ. జనవర! హృతారి వీరసేనుని నసంఖ్య
నవనవిఖ్యాతి హరిముఖ శ్లాఘనీయు
సత్రిశంకు సమాఖ్యుని జనకుని మఱి
పించి ప్రోచితి విన్నాళ్లు ప్రేమ మీఱ.

(హరిశ్చంద్రనలోపాఖ్యానము)

ఇది లాడు మాట లెందు వర్ణింపఁబడినవి. గొప్పగొప్ప యాగము లొనర్చి కొడుకిరితి గడించిన మా తండ్రి త్రిశంకుమహారాజు లేని లోపము లేనియట్టు మమ్ము బరిపాలించితి వని హరిశ్చంద్రునిపక్షమునను, శత్రువృత్తిచె మడించి కీర్తిచేఁ బ్రకాశించిన నీ తండ్రియగు వీరసేనుని మన్నించి యేలితివని నలుని పక్షమునను అర్థములు. ఈ రెండు కథలు ప్రస్తుతములే యగుట నిది ప్రకృతవిషయశ్లేష యగుచున్నది.

అప్రకృత శ్లేష కుదాహరణము—

గీ. ప్రకటితామోదదివ్యపుష్పక సహస్ర
మాలికాధారమైన యీ మణివిమాన
రాజమునకెల్లు సరి! వసురాజ! సారె
పుణ్యజనభర్తఁ బాసిన పుష్పకంబు!

(వసుచరిత్రము)

ఇచట దేవేంద్రుఁడు నలరాజున కొసఁగిన విమానము ప్రస్తుతము. పుణ్యజనభర్తఁ జూపిన పుష్పక మప్రకృతము. పుణ్యజనభర్త యనఁగా- కుబేరుఁడును, పుణ్యాత్ముఁడగు రాజును. అప్రకృతవిషయమునందే శ్లేష యుండుటచే నిది యప్రకృతశ్లేష యనబడెను.

ఉభయశ్లేష కుదాహరణము—

ఉ. ఇచ్చ హితాహితంబు గణియింపని గోలవుగావఁ గానకున్
వచ్చితిగా కహో! పథికవర్గము నొంటిఁ జరింపనిచ్చునే
యిచ్చటి యన్యపుష్టచయ మిచ్చటి మత్తమధువ్రతవ్రజం
బిచ్చటి పల్లవోత్కరము లిచ్చటి పాంసుల పంకజావళుల్?

(వసుచరిత్రము)

ఇందలి "అన్యపుష్టచయ - మత్తమధువ్రతవ్రజ - పల్లవోత్కర - పాంసులపంకజావళి పదములు శ్లిష్టములు. ఇచటఁ గ్రమముగ, కోకిలలు మదావహము - గండుతుమ్మెదల గుంపు - చివురుటాకులు - పుప్పొడితోఁ గూడినతామరలు ప్రస్తుతములు. ఇచట వనవృత్తాంతమే ప్రస్తుతము. తలి దండ్రులచే విడువఁబడి యన్యులచేఁ బోషింపఁబడిన దివ్యకాయలు - త్రాగుఁబోతులు - విటులు - పాపాత్ములు - అప్రకృతార్థములు. కావున నిది ప్రకృతాప్రకృతశ్లేష యగుచున్నది.

---

## 27. అప్రస్తుతప్రశంస

గీ. ప్రస్తుతగమక మైన యప్రస్తుతమున
కమరు నప్రస్తుత ప్రశంసాఖ్య కృతుల

ఒకచో వర్ణింపఁబడిన యప్రస్తుతవృత్తాంతమువలనఁ బ్రస్తుతమగు వృత్తాంతముకూడ నభివ్యక్తమైనచో నది యప్రస్తుతప్రశంస యగును.

ఏదైన సంబంధము లేక అప్రస్తుతవృత్తాంతమువలనఁ బ్రస్తుతము తెలియదు. ఆ సంబంధ మిచట సారూప్యమనియు, సామాన్యవిశేషభావమనియు, కార్య కారణభావమనియు ముత్తెఱంగులై యున్నది. సామాన్యమువలన విశేషావగతి యగుటయు, విశేషమువలన సామాన్యావగతి యగుటయు నని సామాన్య విశేషభావము రెండు విధములు. అట్లే కార్యమువలనఁ గారణమునకుఁగాని, కారణమువలనఁ గార్యమునకుఁగాని స్ఫూర్తి కలుగుటచేఁ గార్యకారణభావము కూడ రెండు విధములు. ఇట్లీ యలంకార మైదు విధములుగ విభజింపఁబడినది.

సారూప్యసంబంధ నిబంధన ముదాహరణము—

గీ. లోపల ననేక రంధ్రముల్ కొమరుమిగిలె
వెలుపలను గంటకావళి వెలసియుండెఁ
గాన బిసనాళగుణ గణ గౌరవంబు
గడఁకతో నెట్లు భంగసంగతము కాదు!

(పండితరాయశతకము)

ఇచట నప్రస్తుతమగు కమలనాళ వృత్తాంతమువలనఁ బయట శత్రువులు చాలమంది యుండి, గృహమునందు భార్యాపుత్రాదులతోఁ గలహించుచున్న యొక పురుషుని వృత్తాంతము ప్రస్తుతమైనది స్ఫురించుచున్నది. అది యప్రస్తుతముతో సమానమగునదియే యగుచున్నది.

సామాన్య విశేషభావమున సామాన్యనిబంధన ముదాహరణము—

గీ. ప్రాప్తకాలుఁడై యొక్క- నెపంబు వొదవిం
పుడమిఁ బచ్చడివానికై కొడుకుఁ బంపి
వాని బ్రతికింతునని యెంచువాఁడు కలఁడె!
కర్మగతి యంత యలఁతియె కడకుఁద్రోవ!

(గాధోపాఖ్యానము)

ఇచటఁ గాలము కూడ చాల విదగ్ధమైనదానిని ప్రతికూల విధమైన సాంగోపాంగ సామాన్యమునకు కూఁ చెప్పుటఁ రక్షించి తన కొడుకుల యాగరక్షకుఁగాఁ బంపఁదలఁచిన విశ్వామిత్రుని వృత్తాంతము విశేష కారణము స్ఫురించుచున్నది.

సామాన్య విశేషభావమున విశేషనిబంధన ఉదాహరణము—

గీ. ముద్దుచే నేణమును వంకమున ధరించు
చందురుఁడు మృగలాంఛన సంజ్ఞనందె;
సకలమృగముల వేఁటాడి చండవృత్తి
వెలయు సింగము మృగరాజబిరుద మందె.

ఇది శిశుపాలవధ కావ్యములోనిది. లోకమున మెత్తఁదనము పనికి రాదనియు, తీరమున తెలిసినవారే గొప్పవా రగుదురనియు బలరాముఁడు శ్రీకృష్ణుని కాలోచనముఁ జెప్పుచున్నాఁడు. ఇచట నా సామాన్యార్థము నను చెప్పక విశేషరూపమునఁ "చంద్రుఁడు మృగలాంఛనుఁడై కళంకియై నాఁడె" ననియు, "చండవృత్తికల్గి క్రూరమైన సింగము మృగరాజయ్యె" ననియు వివరించెను.

కార్యకారణభావమునఁ గారణనిబంధన ఉదాహరణము—

సీ. రాజబింబంబునందు సారము హరించి
చేసినాఁడు విధాత యీ చెలువమోము;
వడిమి రంధ్రంబునందుఁ గానంగవచ్చు
ఘనిఘనీలిమ యది నిదర్శనము కాదె!

(శృంగార నైషధము)

ఇచట దమయంతి వదన నిర్మాణార్థమై విధాత చంద్రమండలము నుండి సారము హరించుట అప్రస్తుతమగు కారణము వర్ణింపఁబడినది. దీనివలన దమయంతీముఖము లోకోత్తరమగు సౌందర్యము కలదని చెప్పఁబడు సౌందర్యము కార్యము ప్రస్తుతము గమ్యమగుచున్నది.

కార్య కారణభావమున కార్యనిబంధన కుదాహరణము—

సీ. పొలఁతుక నడకల పొలుపుఁ గాంచియె యున్న
  రాయంచ లెల్ల గర్వంబు విడుచు;
మగువ మాటలసొంపు మది నెంచియే యున్నఁ
  గోకిలాంగన లెల్ల మూఁగ లగును;
కలికి మైమెత్తనఁ దలఁచియే యున్నచో
  మాలతి పాషాణ మయమె యగును;
చెలఁది తళ్కుంజెక్కి వీక్షించియే యున్నఁ
  గమల కాసారంబుఁ గట్టవలయు;
గీ. మోముగోముఁ గనుంగొనఁ బూనెనేని
చందురుఁడు కృష్ణ నిశలందె డింపవలయు;
ఆమె కెనయైన వస్తు వీ యవనియందుఁ
గలదనుచుఁ బల్క నేరికిఁ గలదు శక్తి!

ఇచట పొలఁతినడక - వాక్కులు - పాదమార్దవము - కేలు - ముఖసౌందర్యము వర్ణనీయములగుటఁ బ్రస్తుతములు. కాని యిచట వర్ణింపఁబడక తత్కార్యములగు హంస - కోకిలా - మాలతీ - అబ్జ - చంద్రుల గర్వ పరిహారములు వర్ణింపఁబడి యున్నవి. కావున నిది కార్యనిబంధన యగుచున్నది.

"ఇచట గర్వపరిహారనిబంధనము కవికల్పితముకాని యథార్థము కాఁజాలదు. యథార్థములు కానివానిని మీఁదిభేదములలోఁ బరిగణించుట యుచితము కా" దని కొందఱు తలంపవచ్చును. కాని యథార్థము కావ్య మగునట్లు బుద్ధియుఁ గార్యము కాఁగలదు. ఇందు యథార్థముచే చెప్పవలె నని నియమము లేదు. ప్రాచీను లందఱు నీఁదిరీతి యుదాహరణముల నిచ్చియున్నారు. కావున దోషము లేదు.

అప్రస్తుతప్రశంసాలంకార మైదు విధములని ప్రాచీనుల యూహ యగును. కాని యట్లు నియమింప వీలులేదు. సంబంధాంతరములందుఁ గూడ నీ యలంకారము సిద్ధింపఁగలదు.

ఇందుల కుదాహరణము—

చ. యమున! అగస్త్య! ఏమిపని! యబ్ధిని నేను మదీయశత్రునా
మముఁ దలపెట్టెదేల! కనుమా! ననునర్మద, నల్పదేమి నీ
రమున! గ్రహించు, మాళవపురంధ్రులకాటుకకంటినీటినై
ల్యమనుచు, వారికేమి వెతయయ్యెను! కుంతలరాజక్రోధిలెన్.

ఇచట సముద్రుఁడు "వారికేమి కష్టము కల్గె"నని మాళవదేశ స్త్రీల రోదన కారణమునడుగఁగా, ఆ కారణమగు ప్రియుల మరణమును నర్మదానది చెప్పవలసియున్నది. కాని అట్లు చెప్పక తన్మరణమునకుఁ గారణమగు కుంతలరాజకోపము నా నది చెప్పెను. కావున నిది కారణమాత్ర నిబంధన యగుచున్నది. మాళవదేశముపై దండెత్తిన కుంతలరాజు దానిని జయించెనా? అను ప్రశ్న కలుగఁగా, మాళవదేశీయ వధానంతర మునైన జలనిధి నర్మదా ప్రశ్నోత్తరరూపమగు కార్యము చెప్పఁబడినదని తలంచినపు డిది కేవలకార్యనిబంధన యైన నగును. ఇది కారణ నిబంధన యగునపుడు ప్రశ్న శబ్దోపాత్తమైనదనియు, కార్యనిబంధన యగునపు డది యర్థసిద్ధమనియు తెలియఁగవలెను. ఇట్టి యలంకారము బహుళసంబంధ నిబద్ధము కావచ్చును.

---

## 28. ప్రస్తుతాంకురము

ప్రస్తుతం బొక ప్రస్తుతార్థంబుఁ దెలుపఁ
బ్రస్తుతాంకుర సంజ్ఞచేఁ బరఁగుచుండు.

ఒక ప్రస్తుతవృత్తాంతమునందలి స్వాభిమతమగు వేఱొక ప్రస్తుతము వ్యక్తమయి యున్నచోఁ బ్రస్తుతాంకుర మగును.

ఉదాహరణము—

గీ. భ్రమరమా! యుపమర్ద మింపలర నోర్చు
పుష్పలతఁగూడి సౌఖ్యముఁ బొందు; మిటుల
బాల నరజస్క నవమల్లికాప్రసూన
కలిక నేలని చెఱతు వకాలమందు!

ఉద్యానవనమధ్యమునఁ జరించుచున్న తుమ్మెదను గుఱించిన యుపాలంభ మిచటఁ బ్రస్తుతము. ఈ ప్రస్తుతవృత్తాంతమునందలి "ప్రౌఢ కాంతలను విడిచి బాలిక నొకతెను గూడు కాముకునిఁ గూర్చిన ప్రస్తుతోపాలంభమే గోచర మగుచున్నది. ఇది యొక విదగ్ధనాయిక పలికిన మాట. ఇచటఁ దుమ్మెదను సంబోధించుట అసంభవము కావున ఇది యప్రస్తుతమే యగుననియు, దానివలనఁ బ్రస్తుతావగతి యగుటచే నిది యప్రస్తుత ప్రశంసయే యగుననియు సందేహము కలుగవచ్చును. కాని చమత్కారమునంబట్టి భ్రమరాది సంబోధనము లోకప్రసిద్ధమై యున్నది; కావున భ్రమరవృత్తాంత మిచట ప్రస్తుతము కావచ్చును.

అప్రస్తుతప్రశంసాలంకారమువలె నిదియును బహువిధ సంబంధ నిబద్ధము కావచ్చును. క్రింది యుదాహరణము సారూప్య సంబంధ యుక్తమై యున్నది.

కార్యనిబంధన ముదాహరణము—

గీ. శిశిరకృత్యంబు లొనరింపఁ దెలియమేన
నింకెఁ బన్నీరు చూత్కార మెసఁగఁ బంద

నంబు వెస బూదియై రాలె ననలుఁ దలిరు
టాకులెల్లను వాడిపాడి యయ్యె నపుడు.

(రుక్మిణీపరిణయము)

ఇచట నాయిక విరహావస్థ వర్ణింపఁబడినది. సంతాపకార్యములగు పన్నీ రింకిపోవుట, చందనము రాలుట, ననలు, తలిరుటాకులు వాడిపాడి యగుట, వర్ణితములు. వానివలనఁ గారణమగు సంతాపము గమ్యమగుచున్నది. ఇచట గమ్యము, గమకమును (రెండును) ప్రస్తుతములే.

---

## 29. పర్యాయోక్తము

ఆ. గమ్యమగుదాని వేఱొకగతిని దెలుపఁ
దనరుచుండుఁ బర్యాయోక్త మనుచుఁ గృతుల.

గమ్యమగు వృత్తాంతమును వేఱొకరీతిని సొగసుగఁ జెప్పినచోఁ బర్యాయోక్తమగును.

ఉదాహరణము—

ఉ. నల్లనిమేను, నిల్వుతిరునామము, పచ్చనిపట్టు, నాభిపైఁ
దెల్లనితమ్మియుం గలుగు దేవుఁడు కుంకుమవన్నె పుల్గురా
బొల్లనినెక్కి నల్పు తెలుపుం గల పూవుల దండఁ దెచ్చియు
త్ఫుల్లనిజాంజలిం బిగురుఁబోఁడి కొసంగె వెసం గృపామతిన్.

(వైజయంతీవిలాసము)

ఇచట నల్లనిమేను మొదలగు విశేషణములంబట్టి యిచటి దేవుఁడు విష్ణువని గమ్యమగు నర్థము. దానిని విశేషణములు చమత్కారముగ (ప్రకారాంతరముగ) తెలియఁజేయుచుండుట నిది పర్యాయోక్తము.

వ్యాజమున నిష్టసాధనవర్ణనమును
వెలయుచుండుఁ బర్యాయోక్తభేద మగుచు.

ఏదేని మిషచేతఁ దన పనిని సిద్ధింపఁజేసికొనుటయుఁ బర్యాయోక్త మగును.

ఉదాహరణము—

సీ. తీరుగాఁ గస్తూరి తిలకంబు దిద్దుచోఁ
గమకించి నెమ్మోము గదియఁ జేర్చు,
హాయలుగా గంధంబు మెయినిండఁ బూయుచోఁ
బరికించి యిక్కువల్ గరఁగ నంటు,
మెలపుగా సిగను బూవులదండఁ జుట్టుచోఁ
బులకించి కుచము వీఁపున ఘటించు,
హరువుగాఁ గై సేసి యద్దంబుఁ జూపుచోఁ
దిలకించి తన మోముఁ దెలియఁజూపుఁ,

గీ. తెలఁగి మాటాడఁబోవుచోఁ జెక్కు గీటుఁ,
బిలిచి పీడెం బొసఁగుచోఁ బెదవిఁ గ్రోలుఁ,
గదిమి పైబడఁ దిగుచుచోఁ గౌఁగిలించుఁ,
దమి మనంబున నాటి రాధావధూటి.

(రాధామాధవ సంవాదము)

ఇచట రాధ శ్రీకృష్ణునికి సంరక్షణ చేయు నెపమున నభీష్టములను నెఱవేర్చుకొనినట్లు వర్ణింపఁబడినది. కావున నిదియుఁ బర్యాయోక్తమగును.



## ౩౦. వ్యాజస్తుతి

గీ. నిందచే స్తుతి, స్తుతిచేత నింద గమ్య
మైన వ్యాజస్తుతి యగుచు నమరుచుండు.

నిందను వర్ణింప స్తుతి గమ్య మైనను, స్తుతిని వర్ణించినచో నింద గమ్య మైనను వ్యాజస్తుతి యగును.

నిందచే స్తుతి గమ్య మగుట కుదాహరణము—

ఆ. సప్తి నొక్కదానిఁ జయ్యన నెక్కి యా
ర్ధంబు చేయుదువని దర్ప మేల!
శాత్రవులును సప్తసప్తి సమారూఢు
లగుచునుండు టరయ మవనినాథ!

ఇచట సప్తసప్తి పదమునందలి శ్లేషమూలమునఁ గల్గు నిందవలన స్తుతి గమ్యమాన మగుచున్నది. సప్తసప్తిసమారూఢు అనఁగా సూర్యు నధిష్ఠించినవారును, ఏడు గుఱ్ఱముల నెక్కినవారును అని యర్థము కలుగును. రాజు ఒక్క గుఱ్ఱము నెక్కిన నతని శత్రువులు సప్తసప్తిసమారూఢు లగుచుండుటంబట్టి రాజునెడ నింద వాచ్యముగ నున్నది. శత్రువులు సూర్యమండలద్వారమున సురలోకమునకుఁ బోవుచున్నా రను నర్థమువల్ల (అనఁగా వారి మరణవర్ణనమునుబట్టి) రాజు గొప్పవాఁడను స్తుతి వ్యంగ్య మగుచున్నది.

స్తుతివలన నింద గమ్య మగుట కుదాహృతి—

శా. ఈపాండిత్యము నీకుఁదక్క మఱి యెందేఁగంటిమే కామశా
స్త్రోపాధ్యాయివి నావచింపఁదవు; మేలోహో! త్రయీధర్మముల్
పాపంబుల్ రతి పుణ్య,మంచు; నిఁక నేలా తర్కముల్! మోక్షల
క్ష్మీపథ్యాగమసూత్రపంక్తికివె పో మీ సంప్రదాయార్థముల్!

(మనుచరిత్రము)

ఇచటఁ బ్రవరుఁడు వరూథినిని చేయు స్తుతివలన వాని నింద గమ్యమగుచున్నది.

మీఁది యుదాహరణములలో నొకదాని స్తుతినిందలవలన దాని నిందాస్తుతులే కల్గినట్లు గోచరించును. కాని యిట్లే యుండవలెనను నియమము లేదు. ఒకదాని స్తుతివలన వేఱొకదాని నిందయు, ఒకదాని నిందవలన వేఱొకదాని స్తుతియుఁ గల్గినను వ్యాజస్తుత్యలంకారమే యగును. ఈ రీతి నొకదాని స్తుతివలన నింకొకదాని స్తుతి తోఁచినపుడు కూడ వ్యాజస్తుతి కాఁగలదు. అన్యస్తుతి వ్యాజమున నన్యస్తుతి కలుగుటం బట్టి లక్షణము సమన్వయించును.

ఉదాహరణము—

ఉ. ఏమి తపంబుఁ జేసెనొ సుమీ! యళులిచ్చలి కేశబంధమై  
తా మదయించినందుకు నిదర్శనమాఁగద! సుప్రసూనపుం  
జాముల గంధబంధుర రసాతిశయానుభవంబు; గల్గునే  
కా మఱి పూర్వజన్మమునఁ గల్గినవృత్తి భవాంతరంబునన్.  
(ఒకానొక చాటువు)

ఇచ్చట అళుల స్తుతివలన నాయికయొక్క కేశపాశ సౌందర్యము యొక్క స్తుతి యభివ్యక్తమగుచున్నది.

## 31. వ్యాజనింద

ఒక్క నింద వర్ణింప వేఱొక్క నింద  
వ్యక్తమగుచున్న నయ్యది వ్యాజనింద.

ఏదైన నిందను వర్ణింప, దానివలన మఱియొక నింద గమ్యమాన మగుచేని వ్యాజనిందాలంకార మగును.



ఉదాహరణము—

క. కట్టెడితనమున కెట్లాడి
గట్టి మనసు రాయి చేసి కరఁగవు; మఱి నీ
పట్టినది విడువ వీఁక ని
న్నట్టిట్టనసేల మాయదృష్టం బుండన్!

(మనుచరిత్రము)

ఇచట వరూథినియొక్క యాత్మనిందవలన ప్రవరనింద యభివ్యక్త మయినది. కావున నిది వ్యాజనిందాలంకార మగును.

---

## 32. ఆక్షేపము

గీ. తాను చెప్పినయదియె నిదానమున ని
షిద్ధ మగునేని వెలయు నాక్షేప మగుచు.

తొలుత నొకదానిని చెప్పి యున్నను, పిదపఁ గొంత యాలోచించి సకారణముగ దానిని నిషేధించిన నది యాక్షేప మగును.

మ. కరుణాసాగర! పొగ్గుపాటికులవేంకట్రామదాసున్వసుం
ధరయం దుంచక స్వర్గలోకమునకుం దర్లించినావేమి? త
త్పురిఁ గల్పాదులు లేవె యాచకులకున్? భూయాచకశ్రేణికె
వ్వరు? దిక్కెమిది? మొండి జగ్గఁడవు కావా! వెఱ్ఱినై పల్కితిన్.

(అడిదము సూరకవి చాటువు)

ఇచటఁ బొణుగుపాటి వెంకట్రామదాసును భగవంతుఁడు స్వర్గలోకమునకుఁ దర్లించుట అనుచిత మని చెప్పి, పిదప నాలోచించి, జగన్నాథస్వామి మొండివాఁడగుట నటుల నొనరించెనని తొలుత చెప్పిన మాట నిషేధింపఁబడినది.

ఒనరఁ బ్రతిషేధ మాభాస యుక్తమైన
నదియు నాక్షేప మని కొంద ఱంద్రు బుధులు.

ఈఁదిరీతి నిషేధము మాత్రమే కాక నిషేధాభాసము కూడ నాక్షేప మగునని యలంకార సర్వస్వకారాదుల మతము. అనఁగా నిషేధము బాధితమై యర్థాంతరమునఁ బరిణమించుచు నొక విశేషమును దెలుపుటయు నాక్షేప మగు నని తెలియవలెను.

ఉదాహరణము—

గీ. అవనినాయక! సందేశహారుల మని
మమ్ము భావింపవలదని మాదుమనవి,
లోకముఁ గుటుంబముగ నెంచు నీకు శత్రు
వుండు నను మాట కల్ల యీ యుర్వియందు.

ఇచట సందేశహారులు 'మేము సందేశహారులము కాము' అని చెప్పుట కుదరాదు. ఆ నిషేధము — సంధి కాలమునకుఁ దగినట్లు సొగసుగా మాటలాడువాడము గా మనెడి యంశముచే తెలియఁజేయుచున్నది.

పరఁగు నదియు నాక్షేపమై వాచ్యవిధిని
వ్యక్త మగు ప్రతిషేధము వరలియున్న.

ఏదైన వాక్యమునందు విధి ప్రకాశముగను, ప్రతిషేధము తప్పఁబడియు నుండి వ్యంగ్య మగుచో నదియు నాక్షేప మగును.

ఉదాహృతి—

గీ. నాథ! తావక విరహసంతాపమునకుఁ
దాళఁగాలే నటంచును దలఁపవలదు;

చాలకాలము వ్యర్థ కల్గఁజాల దింక
వెడలవలసిన నీ విల్లు విడువవచ్చు.

ఇచట నాయిక 'నీవిల్లువిడువవచ్చు' నను విధిని చెప్పియున్నను; విడిచివెళ్లినచో తన మరణము నిశ్చయము కాన నాయకుఁ డిల్లు విడువరాదను నిషేధమును వ్యక్తము చేయుటచే నిది యాక్షేప మగును.

---

## 33. విరోధాభాసము

క. తనరు విరోధాభాసం
బనెడి యలంకార మగుచు నాభాసంబై
తనరెడి విరోధ మెచ్చటఁ
దనరారుచుఁగృతుల సొంపుఁ దనుపుచునుండున్.

ఏదేని విరోధముగఁ దోఁచి, ఆలోచింపఁగా నా విరోధము ప్రకారాంతరమునఁ దొలఁగుచేని విరోధాభాస మగును.

ఉదాహరణము—

సీ. కానక కన్న సంతానంబు కావునఁ
గానక కన్న సంతాన మయ్యొ,
వరయ గోత్రనిధానమై తోఁచుఁ గావున
వరయ గోత్రనిధాన మయ్యొ నేఁడు,
ద్విజ కులాదరణ వర్ధిష్ణుఁడు కావున
ద్విజ కులాదరణ వర్ధిష్ణుఁ డయ్యొ,
వివిధాగమాంత సంవేద్యుఁడు కావున
వివిధాగమాంత సంవేద్యుఁ డయ్యొ,

గీ. కటకటా! దాశరథి సముత్కట కరీంద్ర
కట కలిత దానధారార్ద్ర కటక మార్గ
గామి యెట్లు చరించు నుత్కట కరీంద్ర
కట కలిత దానధారార్ద్ర కటకతతులు?

(రామాభ్యుదయము)

ఇచట నుత్కట కరీంద్ర కట కలిత దానధారార్ద్ర కటకతతులఁ జరించు రాముఁడు ఉత్కట ..తతులఁ జరింప లేఁడని చెప్పుట విరుద్ధము. కాని విచారించి చూచినచో, రాజమార్గములఁ జరించునతఁడు వనభూములఁ జరింపఁజాలఁడని యర్థము స్ఫురించును. కావున నిది విరోధాభాసము.

---

## 34. విభావన

గీ. కారణము లేక కార్యము కలుగుచున్న,[1]
అర్హ హేతువు లేక కార్య మగుచున్న,[2]
కార్య మగుచున్నఁ బ్రతిబంధకలితమయ్యు[3]
కారణము కానియది కార్యకారి యైన,[4]

గీ. కార్యమైన విరుద్ధమౌ కారణమున,[5]
కారణము కార్యమువలనఁ గలుగురీతి
వెలయుచున్న,[6] విభావన వెలయు, నదియు
నాఱు విధము లగును కృతులందు నిట్లు.

1. కారణము లేనిదె కార్యోత్పత్తి యైనచో తొలి విభావన యగును.

ఉదాహరణము—

సీ. కవకగంధము లెఱుంగనివాని కిష్టాప్తి
కాయహీనునకును గరణపటిమ

పెక్కుకాలపుమూఁగ కెక్కువ వాక్ప్రౌఢి
యతిచంచలాత్మున కలఘువృత్తి
యిలఁ బుట్టుగ్రుడ్డకు హితదర్శనప్రీతి
యగమకోటికిఁ బల్లవాభివృద్ధి
జడజాతమునకు శాశ్వత బోధసామగ్రి
కోపనావళికి భావోపశమము

గీ. తెలుపు నిరుపమమాధవ నిత్యసన్ని
ధానమునఁ బొల్చు భవదీయ తాతపాద
సన్నిహితసద్గుణారామసరణి యిదె ల
తాంగి గనుఁగొను మిచటి శోభాతిశయము.

(వసుచరిత్రము)

కవకగంధము తెలుఁగువాని కిష్టాప్తి, గాయము కలవానికిఁ గరణపటిమ, మూఁగకానివానికి వాక్ప్రౌఢి, నిశ్చలున కలఘువృత్తి, కన్నులున్న వానికి దర్శనము, వ్యభిచరించువారికిఁ బల్లవులు, బుద్ధిమంతులకు బోధ, శాంతునికి భావశాంతి కలుగుట ప్రసిద్ధము. మీఁది కార్యములకు, మీఁది కారణము లుండి తీరవలెను. ఆ కారణములు లేకున్నను కార్యనిష్పత్తి యిచట వర్ణింపఁబడి యున్నది.

2. ఒకకార్యము కొనర్పుటయందు నిబంధింపఁబడు కారణమునకు తగిన సామర్థ్యము లేకున్నను కార్యోత్పత్తి యైనట్లు వర్ణించిన రెండవ విభావన యగును.

ఉదాహరణము—

ఉ. మూఁకటివేణితోఁ గురులుకూడకమున్న కుచప్రరోహముల్
పోఁకలతోడ సామ్యమును బొందకమున్న నితంబినీమతున్

ప్రేంకదనం బోలింత ప్రభవింపకమున్న ప్రసూనబాణుఁ డ
స్త్రకలఁ బెట్టెఁ దా వరవ నామెంత బాలికకై వియోగికిన్.

(కళాపూర్ణోదయము)

బాలిక శరీరమున యౌవన మంకురించిన పిదప వియోగికి ఆమెపై వలపు కలుగుట యుచితము. కాని యిచట యౌవన మంకురింపక పోయినను వలపు కల్గినట్లు వర్ణింపఁబడినది. ఇచట కలభాషిణియొక్క సౌందర్యాతిశయమున విశేషము కలదు. కావున నిది విశేషోక్తి యగునని దండ్యాచార్యుని మతము. కాని కారణమున విశేషము లేకున్నఁ గార్య మగుటచే నిది విభావనయే యగునని అప్పయదీక్షితులవా రభిప్రాయపడిరి.

3. కార్య మగుటలో నాటంక మున్నను కార్యమైనట్లు వర్ణించిన మూఁడవ విభావన యగును.

ఉదాహరణము—

గీ. అవనిపాలక! నీప్రతాపార్కమందు
ఛత్రము ధరింపని ద్వేష్యసమితి విడిచి
ఛత్రములతోడఁ గూడియే చనెడి శత్రు
వీరులఁ దపించుచుండెడి వింతఁ గనుము.

ఇచట శత్రువీరులకుఁ దాపము కలుగకుండ ప్రతిబంధకము అగు ఛత్రము ఉన్నను తాపము కలిగినట్లు వర్ణింపఁబడినది.

4. కారణము కానిదానివలనఁ గార్య మైనట్లు వర్ణించిన నాల్గవ విభావన యగును.

ఉదాహరణము—

గీ. కంబువుననుండి కోకిల కలరవంబు
వెడలుచున్నది; తిలపుష్ప విలసితమంబు

మంచిగంధపువాసన మించి వీఁచు
చున్న; దీ వింతఁ గంటివే యువిద, నీవు!

కోకిలరవమునకుఁ గారణము కంఠము; మంచిగంధపు వాసనకుఁ గారణము చందనము. కాని యిచట శంఖ తిలపుష్పములు కారణములుగ వర్ణింపఁబడి యున్నవి.

5. కార్యోత్పత్తికి విరుద్ధమగు కారణముచే ప్రకృతకార్యమునకు కారణముగఁ జెప్పినచో నది యైదవ విభావన యగును.

ఉదాహరణము—

గీ. తెలివిలేనట్టి చన్గవ త్రిజగములను
సంహరించుట యొప్పవఁ జనునుగాక!
శ్రుతిపరిచయము కల్గిన సుదతికన్ను
గవయు జనమారకం బౌట కలదె యెందు!

శ్రుతిపరిచయము కంటి జనమారకము కాఁజాలదు. అట్లయ్యు నిచట జనమారణకార్యము చెప్పఁబడియున్నది.

6. కారణమువల్లఁ గార్యము పుట్టుట సహజము. అట్లుగాక కార్యమువలనఁ గారణ ముత్పన్నమైనట్లు వర్ణించిన నాఱవ విభావన యగును.

ఉదాహరణము—

గీ. కొండపై లత పుట్టుచునుండు టుచిత;
మొప్పునే కొండ లతపయి నెప్పుడైన!
కాని యిప్పుడు విపరీత గతి యొదవెను;
పుట్టినవి స్వర్ణలతపయి గుట్ట లిరు.

కారణము కొండ. కార్యము లత. కొండపై లత పుట్టుట సహజము గాని, లతపైఁ గొండ పుట్టుట సహజము కాదు. ఇచటఁ దద్విపరీతముగ స్వర్ణలతయను స్త్రీతనువుపైఁ గుచములను గుట్టలు రెండు పుట్టినట్లు వర్ణింపఁబడినది.

## 35. విశేషోక్తి

గీ. పుష్కలంబగు కారణంబునను గార్య
మొదవకున్న విశేషోక్తి యొప్పుచుండు.

కార్యోత్పత్తికిఁ గావలసిన కారణకలాప మున్నను కార్యము కలుగకుండుట విశేషోక్తి యగును.

ఉదాహరణము—

ఉ. ఇంతులు గూడి చిట్టకము లెల్ల నరింపఁగ నించుకేనియు
న్వింత తెలుంగు లేక ధరణీధరముంబలె నున్న యా దృఢ
స్వాంతముఁ జూచి రాప్రతిమ చక్కలిగింతలువోలెఁ గంటిరే
యెంతయు రిత్తవోయె మన యుద్ధతి చేష్టలు నన్న నవ్వుచున్.
(పరమయోగి విలాసము)

ఇచట జవ్వనులు కామవికారముఁ గొల్పినను పరమయోగికి మనశ్చలింపనట్లు వర్ణింపఁబడినది. కారణ మున్నను కార్యోత్పత్తి కల్గలేదు కావున నిది విశేషోక్తి.

## 36. అసంభవము

సంభవము కాని యర్థనిష్పత్తి వర్ణ
న మ్మసంభవ మగును కావ్యమ్ములందు.

ఇట్టిపని యెన్నఁడును సంభవింపఁజాలదను రీతిని వర్ణించుట అసంభవాలంకార మగును.

ఉదాహరణము—

చ. కటకట! మమ్మునొక్క త్రుటికాలముఁ బాయనిదాన వొంటిమై
నెటువలె వచ్చితమ్మ! చెలి! యిచ్చటి వ్రేకపుతేనెవాఁక లీ
వెటువలెనీఁ దితమ్మ? తెరువెల్లను బుప్పొడి, నీపదాంబుజం
బెటువలె నోర్చెనమ్మ! తరుణీ! తగునమ్మ కడింది చెయ్దముల్.

(వసుచరిత్రము)

ఇచట గిరిక తన చెలికత్తెలను విడిచి యట్టి ఘోర మగు నరణ్యమునకు వచ్చుట అసంభవము. అట్టి యసంభవమును వర్ణించుటచే నిట నసంభవాలంకారము.

---

## 37. అసంగతి

గీ. ఒక్కయెడ హేతు వున్న వేఱొక్కచోటఁ
గార్యనివృత్తి యైన,[1] నొక్కయెడఁ జేయఁ
దగినకార్యము వేఱొక స్థలమునందుఁ
జలుపుచున్నను,[2] కృతుల నసంగతి యగు.

1. కార్యమొక్కచోటను కారణము వేఱొకచోటను ఉండుట విరుద్ధము. విరుద్ధమైనను హేతుకార్యములు విభిన్నస్థలములం దున్నట్లు వర్ణించుట యసంగతి యగును.

ఉదాహరణము—

గీ. విభుఁడు చిఱునవ్వు నవ్వుచు వెలఁదిచన్ను
గవను నవలతచే మెల్లగాన గొట్టె;
సకియ వ్యథఁ బొందలే; దామెసవతులెల్ల
మిక్కుటంబగు పీడచేఁ బొక్కుచుండ్రి.

ఇచటఁ గొట్టఁబడిన యామెకుఁ గాక, పైవానికిఁ బీడ కలిగినట్లు వర్ణింపఁబడినది.

2. ఒకచోటఁ జేయఁదగిన పనిని వేఱొకచోటఁ జేయుటయు నసంగతి యగును.

ఉదాహరణము—

గీ. పార్థివోత్తమ! నీ తరవారివలన
ఖండితులయిన వైరుల కామినులకుఁ
గనుఁగవం గంకణంబు, లంకమునఁ బత్ర
వల్లి, కరములఁ దిలకంబు నల్లసిల్లె.

కంకణములు చేతులందును, పత్రవల్లి చెక్కిటను, తిలకంబు నుదుటను ఉండవలెను. అవి యట్లుగాక యిచట నయనాదులం దున్నట్లు శ్లేషమూలమున వర్ణింపఁబడినవి. ఇచటఁ గంకణము జలబిందువు; పత్రవల్లి యాఁకులతోడి తీఁగ; తిలకము తిలోదకము.

గీ. ఒకటి చేయఁదలంచి దానికి విరుద్ధ
ముగ నొనర్ప నసంగతి యగును గృతుల.

ఒక పనిఁ జేయఁదలంచి తద్విరుద్ధమగుదానిఁ జేసినయెడల నసంగతి యగును.

గీ. దీనజనరక్షణమునకై దీక్షఁబూని
భక్తజనకల్పవృక్ష! ఓ పరమపురుష!
దీనజనములయం దతి దీనుఁడనగు
నన్నుపేక్షించు టయ్యది న్యాయమగునె!

ఇచట దీనజనముల రక్షింపఁ గంకణముఁగట్టియు దీనుఁ డగు భక్తు నుపేక్షించుట వర్ణితము. కావున నదియు నసంగతి యగును.

## 38. విషమము

విషమ మగు ననురూపత వెలయకుండు
కూర్పును[1] విరుద్ధకార్యముఁ గూర్చియున్న[2]
గీ. నిష్టమున కాసపడిన ననిష్ట మొందు[3]
ముత్తెఱంగులుగాఁ గావ్యములఁ దలంప.

1. అనురూపములు కాని రెండు వస్తువుల నొకచోఁ గూర్చి వర్ణించిన ప్రథమ విషమభేద మగును.

ఉదాహరణము—

ఉ. ఎక్కడివాఁడొ! యక్షతనయేందుజయంతవసంతకంతులం
జక్కఁదనంబునం గెలువఁజాలినవాఁడు మహీసురాన్వయం
బెక్కడ! యాతనూవిభవ మెక్కడ! యేలని బంటుగా మరుం
డక్కఁగొనంగరాదె యకటా! ననువీఁడు పరిగ్రహించినన్.
(మనుచరిత్రము)

ఇచట అననుగుణము లగు - మహీసురాన్వయ - తనూవిభవములకు ఘటన కూర్పఁబడి యున్నది.

2. ఏదేనొక కారణమువలనఁ దద్విరుద్ధమగు కార్య మైనట్లు వర్ణించుట విషమముయొక్క రెండవ భేదమగును.

ఉదాహరణము—

శా. ఆతన్వంగి యనంగఝాంకరణవజ్జ్యాముక్తనారాచని
ర్ఘాతం బోర్వక తమ్ములంచుఁ దటినీగర్భైకసంజాతకం

జాతవ్రాతము మాటుఁ జెందనవి యేచన్ సాఁగె మున్మున్నుగా
“క్షాంతిశ్చేదవచేన కి”మ్మనెడి వాచాయూథి సత్యంబుగన్.
(వసుచరిత్రము)

తమ్ములు రక్షింపవలసియున్నది. ఇచట ఆ తమ్ములు రక్షింపక పీడించుచున్నట్లు వర్ణింపఁబడినది. ఇది విరుద్ధకార్యోత్పత్తి యగును.

8. ఇష్టమున కాసపడి ప్రయత్నింపఁగా అనిష్టము సంభవించుట విషమముయొక్క తృతీయ భేదము.

ఉదాహరణము—

గీ. నీవు గోపాలుఁడవటన్న భావమునను
కడుపు నిండుగఁ బాలను కుడువఁగోరి,
ఆశ్రయించితిఁ గృష్ణ! నిన్నకట! యిపుడు
తల్లిపాలును గఱవయ్యెఁ దత్ఫలముగ.

ఇచట లోకుఁడు పాలకొఱకుఁ గృష్ణు నాశ్రయింపఁగా, నతఁడు వానికిఁ దల్లిపాలును కఱవగున ట్లొనర్చినట్లు వర్ణింపఁబడినది. శ్రీకృష్ణుఁడు మోక్ష మొసఁగుటవలన భక్తునికిఁ దల్లిపాలను అక్కఱలేక పోవునని భావము.

‘అనిష్టప్రాప్తి’ పదమువలన అనిష్టప్రాప్తిని, ఇష్టప్రాప్తి లేకపోవుటను గూడఁ బ్రత్యేకముగఁ గ్రహింపవలసి యున్నది.

గీ. తమ్మిగాడుగును గోరు నో తన్వి! పద్మ
కందమును నూతఁ బడవేయఁ గడఁగెదేల!
కలియుగ మ్మిది యకృతజ్ఞము లలితాంగి!
ఇదియె నీ ముఖకాంతికి నెసరువెట్టు.

తామరదుంపను నీటఁ బడవేసినచో, కాంతి కోరు కమలమునకు పాత్రపత్రము లభింపఁగలదు. కాని యా పద్మము ముఖకాంతిని హరించునను ననిష్టప్రాప్తి యిచటఁ గలదు.

ఇష్టము కలుగకుండుట కుదాహరణము—

గీ. మచ్చఁ దొలఁగింపఁ జంద్రుఁడు మహిని నీదు
మోముగాఁ బుట్టె; నచ్చట బొట్టు పెట్టి
తిరిగి మచ్చను గూర్తువో తరుణి, యేల?
పోలఁతు లాశ్రితులకె మచ్చ గొలుపుచుంద్రు.

ఇచ్చట కోరిన కళంకహానము కుదురనందున ఇష్టానవాప్తి కిది యుదాహరణ మగుచున్నది. ఈ భేదమే చమత్కారముంబట్టి యనేక రీతు లగును

---

## 39. సమము

సమ మనంబను ననురూప సంఘటనము,[1]
కార్యకారణ సారూప్యగతియుఁ,[2] గార్య
గీ. సిద్ధియు ననిష్టమే లేక చెలఁగియుండు
రీతియు[3] నటంచు నది మూఁడు రీతు లయ్యె.

1. అనురూపము లగు రెండు వస్తువులం గూర్చిన సమాలంకార మగును.

ఉదాహరణము—

ఉ. ఇంతబెడంగు లోకమున నెవ్వరికున్నది యంబ! తా నిజా
త్యంతిక నైపుణీమహిమ యంచన వ్రాసెనొ యేమొ కాక యా

గొప్ప ఆధారమును వర్ణించి, దాని నాశ్రయించినదానిని (ఆధేయమును) దానిఁ యాధారముకంటె హెచ్చుగ వర్ణించిన నధిక మగును.

ఉదాహరణము—

క. పదునాలుగు లోకంబులు
కడుపుగ నున్నట్టి శౌరి కుక్షిని, ముని నా
రదు నాగమ జనితములగు
ముదము లిముడ లేకపోయె ముప్పిరిగొనుచున్.

కృష్ణుఁడు పదునాల్గు లోకములను కడుపులో నుంచెనుటచే నది చాల పెద్దదని తెలియుచున్నది. దానియందు సంతోషము ఇముడలేకపుటచే నా యుదరముకంటె నదియే గొప్పదని తెలియుచున్నది కావున నిది అధికాలంకార మగుచున్నది.

కర మధికమగు నాశ్రయికంటె నధిక
మైన యాధారముం జెప్ప నధిక మగును.

గొప్పదైన యాధేయముకంటె ఆధారముకూడఁ జాల గొప్పదైనట్లు వర్ణించుటయు నధికాలంకార మగును.

ఉదాహరణము—

క. సువిశాలం బన నొప్పును
భువన త్రితయంబు, మిగుల పొల్పగు నీ కీ
ర్తి విశాలంబై నను స్వే
చ్ఛ వరలుచు వెలుంగుకతన జగతీనాథా!

ఇచట విశాలముగ నున్న యాకంబుకంటె దాని కాశ్రయమగు లోకత్రయము విశాల మైనదిగఁ జెప్పఁబడినది. ఇచట లోకత్రయ

వర్ణన చేయఁబడినట్లు తోఁచును. కాని యశోగుణమున కాశ్రయమగుటవల్లనే జగత్త్రయము విశాల మైనట్లు వర్ణింపఁబడినది కాఁబట్టి యశోగుణ ప్రశంసయే యిచట ముఖ్యమని యెఱుంగునది.



## 42. అల్పము

ఆ.వె. అల్పమగును సూక్ష్మమైన యాశ్రయికంటె
నాశ్రయంబు సూక్ష్మ మగుచు నుండ.

సూక్ష్మమైన యాధేయముకంటె నాధారమును మిగుల సూక్ష్మముగ వర్ణించుట అల్పాలంకార మగును.

ఉదాహరణము—

గీ. పూటపూట కరతోఁటి పాదము కతన
విన్ననై యున్న దీ కన్య వేణి దూల
సన్నగిలియున్నగతి నెన్నఁజనునె యకట!
యూర్మికలు కంకణాకృతి నొనరె నపుడు.

(వసుచరిత్రము)

ఇందు గిరికయొక్క విరహావస్థ వర్ణింపఁబడినది. ఆమె విరహామూలమునఁ గృశింపఁగా ఉంగరములు కంకణములైనవని యిచటి వర్ణనము. ఉంగరము సూక్ష్మము. అది కంకణముగ మాఱిన దనుటచే, గిరికచేయి, దానికంటెను సూక్ష్మమైనదని తెలియుచున్నది. కావున నిచట ఆధేయముకంటె నాధారము అల్పముగ వర్ణింపఁబడుటచేత అల్పము.



## 43. అన్యోన్యము

ఒక్కదాని కొకటి యుపకృతిచేయ న
న్యోన్యమనుచుఁ గృతుల నతులకెక్కు.

రెండు వస్తువు లొకదాని కింకొకటి ఉపకారక మగుచోని అన్యోన్యాలంకార మగును.

ఉదాహరణము—

మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులున్వనము, కుంతీనందనుల్సింహము
ల్మతినూహింప నసింహమైనవనమున్ మర్దింతు రెందున్ వనా
వృతవృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందుఁ గా
న తగంబొందుట కార్యమీయుభయమున్ సంతుష్టిమైనున్నికిన్.

(భారతము)

ఇచట దుర్యోధనాదులకును పాండవులకును పరస్పర మన్యోన్యోపకారక భావము చక్కని పోలికమూలమున వర్ణింపఁబడి యున్నది.



## 44. విశేషము

సీ. ఖ్యాతమగు నాశ్రయము లేక యాశ్రయిని ని
లిపిన[1], నాధేయ మొక్కటియె పలుచోట్లఁ
బెలయఁగ[2], నశక్యకరణంబు చెలఁగ నొక్క
దానిఁగో[3], విశేషాభిధాన మగును.

1. ప్రసిద్ధమగు నాధారము లేకున్నను, ఆధేయమును వర్ణించుట ఒకటి విశేష మగును.

ఉదాహరణము—

ఆ. వె. నీరులేనిచోట నెత్తమ్మి, తమ్మిలోఁ
గలువ, లవియుఁ గనక లలిత లతను,
లతయు సౌకుమార్యగతి నొప్పుచుండు; నీ
చిత్రసృష్టి శోభఁ జెప్పఁదరమె!

తామరలు నీటియందే యుండును. నీరు లేనిచోట నది యున్నట్లు, తామరలోఁ గలువ లున్నట్లు, బంగారు లతపై నవి యుండుటయు నున్నట్లును ఇచట వర్ణనము; కావున నిది విశేషోక్తి యగును. ఆధార మేమియు లేనిచోట గూడ నాధేయమును వర్ణించుటయుఁ గలదు.

2. ఒకే వస్తువు పెక్కుచోట్ల నున్నట్లు వర్ణించిన నదియు విశేష మగును.

ఉదాహరణము—

మ. కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁ డగ్నిం దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల యీ యా యెడన్.
(భాగవతము)

ఇచట ఒక్కఁడే శ్రీహరి పలుతావుల నున్నట్లు చెప్పఁబడినది.

3. ఒకపని నొనర్పఁ దలంచి, దాని యత్నముచేత, శక్యముకాని కార్యాంతరము సిద్ధించుటయు విశేష మగును.

ఉదాహరణము

గీ. రూపసంపత్తి నిధిని ప్రతాపశాలి
సకలవిద్యాప్రవీణుని నజుఁడు నిన్ను
సృష్టిచేయుచుఁ గ్రొత్తగా సిరికొమరుని
వర్యముని గురుని సృజించె నవని నిజము.

ఇచట రాజసృష్ట్యారంభమున అశక్యమగు మాతన మన్మథాదిసృష్టి వర్ణింపఁబడుట నిది విశేషము.

---

## 45. వ్యాఘాతము

గీ. ఒక్కకార్యమ్మునకుఁ దగి యుండుదానిఁ
దద్విరుద్ధమైన క్రియఁ దారిచినను,
రహిని రెండు విరుద్ధకార్యముల కొక్క
కారణము చెప్పియున్న వ్యాఘాతమగును.

1. ఒకదానిఁ జేయునది, దానికి విరుద్ధమైన దానిఁ జేయుటో వ్యాఘాతమగును.

ఉదాహరణము—

గీ. నయనమున దగ్ధుఁడైన మనసిజుఁ గాము
వాలుచూపున బ్రతికించి వాసికెక్క
మూఁడుకన్నుల దేవుని నోడఁజేయు
వామలోచనలన్ మదిఁ బ్రస్తుతింతు.

ఇచట శత్రుని ఖండితుఁడని మరణించిన మనుష్యుని స్త్రీలు కంటి నీరుచే జీవింపఁజేయుచున్నట్లు వర్ణింపఁబడినది.

2. ఒక కారణ మొక కార్యమునకే గాక తద్విరుద్ధకార్యమునకుఁ గూడ సమముగ నైనచో, అదియు వ్యాఘాత మగును.

క. దారిద్ర్యశంక చేతను
భూరి ధనంబుల విడువరు భువి లుబ్ధజనుల్;
దారిద్ర్యశంక చేత న
కారు ధనంబుల విడుతురు దాతృజనంబుల్.

తమకు దారిద్ర్యము కలుగునని లుబ్ధ లోకులు ధన మీయరనియు, (జన్మాంతరమున) దారిద్ర్యము కలుగకుండుటకయియే ధర్మాత్ములు దానము చేయుదురనియు—ఇట్లు విరుద్ధకార్య ద్వయమునకును దారిద్ర్యమే కారణముగఁ జెప్పఁబడినది.

## 40. కారణమాల

రచన కారణమాల పూర్వంబు నుత్త
రమ్ము నుత్తరపూర్వకారణములైన.

పూర్వపూర్వము నుత్తరోత్తరమునకుఁ గాని, ఉత్తరోత్తరము పూర్వపూర్వమునకుఁ గాని కారణమైనట్లు వర్ణించుట కారణమాలాలంకార మగును. అందు మొదటిభేదమున కుదాహరణము—

గీ. విద్య యొసఁగును వినయంబు, వినయమునను
బడయుఁ బాత్రత, పాత్రతవలన ధనము,

ధనమువలనను ధర్మంబు, దానివలన
నైహికాముష్మికసుఖంబు లందు నరుఁడు.

(భారతము)

ఇచటఁ బూర్వపూర్వములగు విద్యాదులు, ఉత్తరోత్తరములగు వినయాదులకుఁ గారణము లైనట్లు వర్ణింపఁబడినది.

రెండవ భేదమున కుదాహరణము —

క. నరకమగును దురితంబున,
దురితము దారిద్ర్యభవము, దుర్భరమగు నా
దురితార్జిత దారిద్ర్యము
కర మమరెడి నీవి లేనికతమున నెందున్.

ఇచట నుత్తరోత్తరమగు దురితాదికము పూర్వపూర్వమగు నరకాదికమునకుఁ గారణ మైనట్లు చెప్పఁబడినది.

## 47. ఏకావళి

ఎంతు రేకావళి యని గృహీత ముక్త
రీతిచే నర్థఘటనల రీతి వెలయ.

ఉత్తరోత్తరము పూర్వపూర్వమునకు విశేషణమైనను, (విశేషణము నప్రధానము) పూర్వపూర్వ ముత్తరోత్తరమునకు విశేషణమైనను గృహీతముక్తరీతి యనఁబడును. ఆ రీతిగ నర్థములు కూర్పఁబడు నేని యేకావళి యను నలంకార మగును.

మొదటి భేదమున కుదాహరణము—

గీ. కన్ను లాకర్ణవిశ్రాంతిఁ జెన్నుమీఱు
వీనులు భుజపర్యంతము వ్రేలుచుండు
భుజయుగము జానుపర్యంతమును బ్రలంబ
మానతను రాణఁగాంచు నా మనుజపతికి.

ఇచట నుత్తరోత్తరములగు కర్ణములు మున్నగునవి పూర్వపూర్వము లగు కన్నులు మున్నగువానికి విశేషణములయి యుండుటవలన నిచట మొదటి యేకావళీభేద మని గ్రహింపవలెను.

రెండవ భేదమున కుదాహరణము—

ఉ. తావుల వెంబడిం దగిలి తార్కొనెఁ దేఁటులు, తేఁటిఱెక్కలం
బోవక నాటెఁ బుప్పొడియుఁ, బుప్పొడితోఁ దగెఁ బూవుసోన, యా
పూవులసోనతో మిగులఁ బొల్చెను కల్పతరుప్రసూనమా
ధ్వీవిసరంబు, నా వెనుక నీఁ జను కమ్మనిచల్లఁదెమ్మరల్.
(సత్యభామాసాంత్వనము)

ఇచట నుత్తరోత్తరములగు తేంట్లు మొదలగునవి పూర్వపూర్వములగు తావులు మొదలగువానికి విశేషణములుగా వర్ణింపఁబడినవి.

---

## 48. మాలాదీపకము

గీ. దీపకైకావళుల్ గూర్చు తేజరిల్ల
నదియె యొప్పు మాలాదీపకాఖ్యఁ గృతుల.

దీపకాలంకారము, ఏకావళ్యలంకారము నొక్కచోఁ గలిసి వర్ణింపఁబడిన మాలాదీపక మగును.

ఉదాహరణము—

క. అసమాస్త్రుఁడు మన్మథుఁ డా
విసరుహపత్రాక్షి చిత్తపీఠిక, నా మా
నసము కరము నీ యందును
వసియించెను వేఱుమాట పలుకఁగ నేలా!

ఇచట "వసియించె" ననుక్రియ యొక్కటే ప్రస్తుతాప్రస్తుతము లగు స్త్రీచిత్త, పురుషచిత్తములందుఁ జెప్పఁబడుట దీపక మగును. ఉత్తరోత్తరము పూర్వపూర్వమునకు విశేషణ మగుటచే నిది ఏకావళియు నగును. కావున నీ యలంకారద్వయయుక్తిచే నిది మాలాదీపకము కాఁగలదు.

---

## 49. సారము

ఉత్తరోత్తర ముత్కర్ష నొందు నేని
సారమను నలంకారమై సన్నుతిఁగను.

పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము గొప్పదైనట్లు వర్ణించుట సారాలంకార మగును.

ఉదాహరణము—

ఉ. నుతజలపూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత! యొక బావి మేలు, మఱి బావులునూఱిటికంటె నొక్క స

క్రతువది మేలు, తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు, తత్సుతశతకంబుకంటె నొకసూనృత వాక్యము మేలు చూడఁగన్.

(భారతము)

ఇచట నూతికంటె బావి, బావికంటె క్రతువు, క్రతువుకంటె సుతుఁడు, సుతునికంటె సత్యవాక్యము గొప్పదైనట్లు చెప్పఁబడుట నిది సారాలంకార మనుచున్నది.



## 50. యథాసంఖ్యము

గీ. క్రమికముల కన్వయంబును గ్రమముగాను
చెప్పియున్న యథాసంఖ్య మొప్పుచుండు.

క్రమముగఁ జెప్పిన వస్తువుల కా క్రమము ననుసరించియే అన్వయమును గూర్చినచో యథాసంఖ్య మగును.

ఉదాహరణము—

సీ. గ్రుడ్డుకానుపు తేఁడు గ్రుడ్డుకానుపు తేఁడు
గట్టంబు పాన్పైన కొమరుమిగుల,
చింకతాలుపరియు చింకతాలుపరియు
మఱఁదియు నసుఁగునై మెఱుపుఁజూప,
నీరుపుట్టువయును నీరుపుట్టువయును
బారయుఁ దొడవునై పొలుపు నెఱప,

పచ్చవార్వపుఱేఁడు పచ్చవార్వపుఱేఁడు
వలకన్ను కొడుకునై వలపు గులుక,
గీ. చుట్టువాలును నెవ్వాపోఁగొట్టువాలు,
బిట్టుఁగ్రాలు పసిండి క్రొంబట్టుచేలు,
మెట్టుజాలు మొగిల్పస మెట్టఁజాలు
నట్టిరాలును గల జగజెట్టిఁ గొలుతు.

(అచ్చతెలుఁగు రామాయణము)

ఇచట సీసమున ప్రతిపాదమునను మొదటి సగమునకు రెండవ సగమునకును క్రమముగ సమన్వయము. తొలిచరణమున మొదటివాఁడు గరుడుఁడు సూర్యుఁడు; రెండవవాఁ డనంతుఁడు పాము. ఈ రీతిగ తక్కిన చరణములందును గ్రహించునది. క్రమాన్వయ ముండుటంబట్టి యిది యథాసంఖ్య మగుచున్నది.

---

## 61. పర్యాయము

క్రమత నేక మనేకాశ్రయముగ నున్న,
జాలవస్తువు లొకదాని సంశ్రయింప
గీ. వెలయుఁ బర్యాయమని;

1. క్రమక్రమముగ నొకటి యనేకము నాశ్రయించినట్లు చెప్పిన నొక పర్యాయభేద మగును.

ఉదాహరణము—

ఉ. శైలము లెక్క యష్టమదసామజవాళులమీఁదుగా మహా
కోలము వెన్ను దాఁటి పలుగొమ్ము మొనం బడి సర్వదా విష
జ్వాలలఁ గ్రమ్ము శేషు తలదాయనె వాదక వచ్చి కూడె నా
భూలలితాంగి కెంత వలపో రఘునాథనృపాలునందునన్.

(విజయవిలాసము)

ఇచట భూమి యొక్కటియే శైలములు, అష్టగజములు, కూర్మము, వరాహము, అనంతుఁడు అనువాని నాశ్రయించినట్లు వర్ణింపఁబడినది కావున నిది పర్యాయాలంకార మగుచున్నది.

2. అనేకములగు వస్తువు లొక్కదాని నాశ్రయించినట్లు వర్ణించినను పర్యాయాలంకార మగును.

ఉదాహరణము—

మ. చెవికిం గేలివతంసనోత్పలదళశ్రీలై, కపోలంబులన్
నవకాలాగురుపత్రరేఖలయి, మేనం గమ్మకస్తూరియై
ధవళాంభోరుహనేత్రపైఁ గురిసె నుద్యల్లీల సీమంతపుం
నవనాట్యాహుతిహోమసంప్రభవచంచద్వహ్నిధూమచ్ఛటల్.

(శివరాత్రి మాహాత్మ్యము)

ఇచట వహ్ని ధూమచ్ఛట అను ఆధారమును ఉత్పలదళము, కాలాగురు పత్రరేఖలు, కమ్మకస్తూరి అను వస్త్వాధేయము లాశ్రయించి యుండుట నిదియుఁ బర్యాయ మగును.



ఏదైన వస్తువు నొక్కచోట నిషేధించి మఱొకచోటఁ జెప్పుట పరిసంఖ్యాలంకార మగును.

ఉదాహృతి—

గీ. విద్యయొకఁ గాని యసుర క్తి వెలఁదిపట్లఁ
గాదు; దీక్షయు సత్కీర్తికలనఁగాని
అతుల ధన సముపార్జనమందుఁ గాదు
వైరిసంహారి యైన యా పార్థివునకు.

ఇచట అనురాగమును స్త్రీయందు నిషేధించి విద్యయందును, దీక్షను ధనార్జనమున నిషేధించి కీర్తియందును విధించుట నిది పరిసంఖ్య యగును.



## 54. వికల్పము

గీ. అగు వికల్పము, తుల్యబలాన్వితముల
కైన శత్రుత్వ మింపుగా నమరి యున్న.

సమానబలము గల రెండు వస్తువులకు విరోధమును వర్ణించిన వికల్పాలంకార మగును.

ఉదాహరణము—

గీ. అతసముఁడఁడి వర్షము లవిరళముగఁ
బడుచునున్నవి శిఖినృత్యపటిమ చెలఁగ;
తాపము నడంప నొక్కఁడే తనరు నిపుడు
కాంతుఁడైనను, లేక కృతాంతుఁడైన.

ఇచటఁ దాపము నడంచుటలోఁ గాంతుఁడును యముఁడును సమ బలు లైనట్లు వర్ణింపఁబడినది. ప్రియుఁడు వచ్చిన సరగను కలుగదు

మనకును కల్గినఁ బ్రియసమాగమము లేదు. కావున నిందు కార్యమునకు విరోధము.

---

## 55. సముచ్చయము

పెక్కిటికి యోగపద్యము వెలయుచుండు
తఱి యున్న సముచ్చయఖ్యాతిఁ జెందు.[1]

గీ. అహమహమికను నేక కార్యాన్వయంబు
కలిగియున్న సముచ్చయాఖ్యను జెలంగు.[2]

1. పెక్కుపను లొక్కపారియే జరిగినట్లు వర్ణించిన సముచ్చయ మగును.

ఉదాహరణము —

చ. చిలుకలఁ గొట్టు నెచ్చెలులఁ జేటికిఁ దిట్టుఁ గలంచుఁ దేటులన్
దలఁకఁగఁ జేయుఁ గోయిలలఁ దద్దయుఁ జందురునట్టు దూఱుఁ జా
క్కులదొర కాయ మెండ నగు కాఁక కుఁ దాళఁగ లేక చొక్కునం
చలనలఁ జూచుఁ దలంకు నెదఁ జల్లని గాలికిఁ జూచు నల్ దెసల్.
(శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధము)

ఇచటఁ గొట్టుట మొదలగు పను లొక్కసమయమునందే జరిగినట్లు వర్ణింపఁబడినవి.

2. ఏదైన కార్యమును నెఱవేర్చుటకు ఒకదానిని మించి నొకటి ముందుగా వచ్చునట్టి రీతిని వర్ణించిన ద్వితీయసముచ్చయ మగును.

ఉదాహృతి—

మ. వలనాసత్యవసంతులం గెలుచు సౌందర్యంబు ధైర్యంబు దో
ర్బలమున్ స్వామిహితానువృత్తి దయయుం బ్రాభవ్యము
[విద్యయున్

తెలియన్ బాల్యమునందె నీవు మధురాధీనాథు మెప్పించవా
భళిరా! వేంకటకృష్ణభూవరమణీ! భాషావణిగ్రామణీ!
(అహల్యాసంక్రందనము)

ఇచట మధురానాథుని మెప్పించుటలో వేంకటకృష్ణభూపుని సౌందర్యాదులు ఒకదానినిమించి యొకటి కారణము లగుచున్నవి.

---

## 56. కారకదీపకము

ఏకకారకగతములై యొసఁగు క్రియల
ఘటన కారకదీపకఖ్యాతిఁ జెందు.

ఒక్క కారకమే చాల క్రియలయం దన్వయించినఁ గారకదీపక మగును. దీపమురీతి నొకే కారకము చాల చోట్ల నుపయోగించుఁ గావున దీని కీ నామము కల్గినది.

ఉదాహరణము—

ఉ. మించితి వల్కఁ జేఁ గడుఁ బ్రమించితి వన్నెఱవించితీవు కొ
ట్టించితి భర్తలన్ బ్రతిఘటించితి సేవకు రాక పీఠిలో
నుంచితి వెల్ల వేల్పుల నయో! విన యోచరీతి నుండు నీ
మంచితనంబు లెందుఁ గనె! మంచిది మంచిదిలే తలోదరీ!
(అ[illegible])

ఇచట వెక్కిరించుట మొదలగు క్రియ లన్నింటియందును నీవు అను కారక మొక్కటే యన్వయించుచున్నది.

---

## 57. సమాధి

గీ. కారణాంతరసన్నిధిఁ గార్యమునకు
సుకరత సమాధి యగుచును సొంపు మిగులు.

ఏదేని పని సాధింపఁదలఁచినప్పుడు దాని కనుగుణముగ కారణాంతరము లభించుట సమాధి. సమాధి యన తెన్నుగా కూర్చుట.

ఉదాహృతి—

గీ. అలరుఁబోఁడికిఁ గల్గిన యలుకఁ దీర్పఁ
దత్పదంబుల నేఁ బడఁదలఁచుచుండ
దాని కుపకారకంబయి దైవికముగ
మేఘగర్జన యొంతయు మింటఁ జెలఁగె.

ఇచట అలుక తీర్పఁ బ్రయత్నించుట కనుగుణముగ, నందు కుపకరించునట్టి యుపాయము వర్ణింపఁబడినది.

---

## 58. ప్రత్యనీకము

ప్రబలు వైరిని విడిచి తత్పక్షమునఁ బ
రాక్రమము ప్రత్యనీకమై రహిఁ జెలంగు.

తన శత్రువు మిక్కిలి బలవంతుఁడగుటచే నతని నేమియుఁ జేయఁ జాలక, అతని నాశ్రయించినవానియెడఁ బరాక్రమముఁ జూపుట ప్రత్యనీకాలంకారము.

ఉదాహరణము—

గీ. పుడమి నా రూపుసొంపుల నడఁచివేయు
వానిఁ గోరుచున్న దీ వనిత యనుచు
మత్సరమువూని నీయెడ మహితమూర్తి!
మరుఁడు దయమాలి నీ తన్వి మాడ్చుచుండె.

ఇచట మన్మథునికి నాయకునిపై ద్వేషమున్నను, అతని నేమియుఁ జేయలేక నాయికను పీడించుచున్నట్లు వర్ణింపఁబడినది. తన శత్రువుపక్షము

ఆశ్రయించినవారియెడఁ బరాక్రమించినపుడే ప్రత్యనీక మగుచున్నపుడు శత్రువువాడఁ బరాక్రమించినను ప్రత్యనీక మగునని వేఱే చెప్పనక్కఱలేదు.

## 59. అర్థాపత్తి

గీ. కైముతికనీతి నర్థము కావ్యమందు
సిద్ధినొంద నర్థాపత్తి చెన్నుమీఱు.

కైముత్యన్యాయమున నర్థమును సిద్ధింపఁజేసిన నర్థాపత్తి యగును. ఇది శాస్త్రమందలి యర్థాపత్తిప్రమాణముకంటె విలక్షణమగుటచే నిట్లు చెప్పఁబడుచున్నది. ఒకదానిఁగూర్చి చెప్పునపుడు "ఇట్టిదే యిట్లగు చుండఁగా, దానిసంగతి వేఱుగ చెప్పనేల!" అనుటయే కైముతిక న్యాయ మనఁబడును.

ఉదాహరణము—

క. కరమర్థి నీను పెనుపం
బెరిగిన శుక మోటలేక ప్రేలుచు హృదయం
బెరయింపఁదొణఁగె; నింకం
బరభృతములు చెప్పనేల పంకజవదనా!

(కవికర్ణరసాయనము)

ఇచటఁ దాఁబెంచిన చిలుకచే పీడఁ గూర్చినపుడు, పరభృతములు (ఇతరులచేఁ బెంచఁబడిన కోకిలలు) పీడించునని వేఱుగా చెప్పవలెనా? అను రీతిచేఁ బీడించియే తీరునను అర్థము సిద్ధించుచున్నది కావున నిది యర్థాపత్తి యగును. కావ్యార్థాపత్తి అనియు దీనికిఁ బేరు.

## 60. కావ్యలింగము

అర్థము సమర్థనాపేక్షమైనఁ దత్స
మర్థనము కావ్యలింగనామంబు నొందు.

ఒక యర్థమును సమర్థింపవలసినపుడు దానిని సమర్థించినచోఁ గావ్యలింగ మగును. నైయాయికులు చెప్పు "లింగము" (హేతువు) వ్యాప్తి వ్యాపక పక్షధర్మతాద్యుపేతమై కలిగి యుండును. ఇచటి లింగము తద్విలక్షణమగుటఁ గావ్యలింగ మగుచున్నది. ఇది వాక్యార్థహేతుక మనియుఁ బదార్థహేతుక మనియు రెండు విధములు. ఒకదానిని సమర్థించుటలో వాక్యము హేతువైనచో వాక్యార్థహేతుక మగును. పదము హేతువైనచోఁ బదార్థహేతుక మగును.

పదార్థహేతుకమున కుదాహరణము—

ఉ. విలయకృశానుకీలముల వేఁడిమిఁ బోఁడిమి మాలి వెల్వడిన్
కలిసినభూతధాత్రి మఱిక్రమ్మఱ రూపయి నిల్చి యోషధుల్
మొలవఁగఁ జేయఁ బట్టి పయమున్ బ్రతికల్పము నెట్లు గాంచునో
చలిమలవల్లనుల్లసిలు చల్లఁదనంబును నూనకుండినన్.

(మనుచరిత్రము)

ఇచట భూతధాత్రి ప్రతికల్పము నోషధులు మొలవఁ జేయు సయమూఁ బొందుటలో మంచుకొండచల్లఁదనమే హేతువైనట్లు చెప్పఁబడినది. ఈ హేతు విచట వాక్యరూపము కాక పదమే యగుటచే నిది పదార్థహేతుకమున కుదాహరణ మగుచున్నది.

వాక్యార్థహేతుకమున కుదాహృతి—

గీ. పిన్నయప్పుడె యముఁబట్టి పీచమడఁచె,
నెదయొఱఁగి వేలుపులనెల్ల నేపుమాపెఁ,
ద్రిభువనాధీశులనుగూడ ధిక్కరించె,
నమ్మహాకాయు నెదిరింప నలవియగునె!

(శతకంఠరామాయణము)

ఇచట "అమ్మహాకాయు నెదిరింప నలవి" కాకుండుటలో, అతఁడు యముఁడు, దేవతలు, త్రిభువనాధీశుఁడు మొదలయినవారిని జయించుటలు

అనేక వాక్యములు కారణములుగఁ జెప్పఁబడినవి. కావున నిది వాక్యార్థహేతుక మగును.

---

## 61. అర్థాంతరన్యాసము

గీ. వెలయు సామాన్యము విశేషము లలితగతి
నమరుచుండు నర్థాంతరన్యాస మగుచు.

సామాన్యము, విశేషము శబ్దములచే నిరూపింపఁబడి యున్నచో నర్థాంతరన్యాస మగును. అం దొకటి ప్రస్తుతము, వేఱొకటి యప్రస్తుతము నగుచుండును. విశేషము ప్రస్తుతమై సామాన్య మప్రస్తుతమైనచో సామాన్యముచే విశేషసమర్థన రూపభేద మగును. సామాన్యము ప్రస్తుతమై విశేషము ప్రస్తుతేతరమైనచో విశేషముచే సామాన్య సమర్థనరూపభేద మగును. ఒకదానితోఁ గూడ నర్థాంతరముయొక్క న్యసనము (ఉంచుట) ఇందుండుటచే నీ యలంకార మర్థాంతరన్యాస మగుచున్నది.

ప్రథమభేదమున కుదాహరణము—

ఉ. పక్షము పెంపునం గుసుమబాణునిమీఁదనె వ్రాలె దేవతా
ధ్యక్షుని వేయికన్నులును దక్కిన వేల్పుల నుజ్జగించి, సా
క్షేపకఁ జూడఁ గార్యగతి యిట్టిదయౌఁ బ్రభువుల్ ప్రయోజనా
పేక్ష నొకప్పు డాశ్రితులపైర సమంచిత గౌరవోన్నతుల్.
(హరవిలాసము)

ఇచటఁ బ్రయోజనము ననుసరించి ప్రభువు లాశ్రితులయెడ గౌరవముఁ జూపుదురను సామాన్యముచే దేవేంద్రుని వేయికన్నులును మన్మథునిపై వ్రాలినవను విశేషము సమర్థింపఁబడి యున్నది.

రెండవ భేదమున కుదాహరణము—

క. ధర నెచటఁ బరీక్షకగణ
మరయఁగలే దచట మణు లనర్ఘ్యములగు; నా

నెఱకొంపును వల్లవపురి
గరితలు వల్కొదరు మాఁడుగవ్వల కెనగాన్.

(తండికరాజు శతకము)

ఇచట గొల్లపల్లెయందలి యాఁడువారు కొంపను మాఁడు గవ్వల పాలియందురను విశేష ప్రస్తుతము. దానివలనఁ బరీక్షకులు లేనిచోట మనుజుల మంచిచెడ్డలు తెలియవను సామాన్యము ప్రస్తుతము సమర్థితమగుచున్నది.

---

## 62. వికస్వరము

తెలసిన విశేషసామాన్యములు విశేష
మును వికస్వరసంజ్ఞచే వినుతికెక్కు.

ఒక విశేషమును సమర్థింప నొక సామాన్యముఁ జెప్పియున్నను, అది యప్రసిద్ధమను శంకచే, ఆ సామాన్యముఁగూడ సమర్థింప మఱియొక విశేషమును ఉపమానవిధముచేఁగాని, అర్థాంతరన్యాసవిధినిగాని నిరూపించిన వికస్వరాలంకార మగును.

ఉపమానరీతి కుదాహృతి—

క. అనఘరత్న జనకుఁడగు న
గ్నమహీధరవరు సొగసు మంచు మాపఁగ లే; ది
మ్మహి గుణతతి నొకదోసము
మిహికాంశుని ఘృణుల గుఱుతు మెయిని వణంగున్.

(నిర్వచన కుమారసంభవము)

లెక్కలేని రత్నములకు గని యగు హిమవంతునికి మంచు సౌభాగ్య హాని కాదను విశేష మిచటఁ బ్రస్తుతము. దానిని సమర్థింప "గుణముల నడుమ నొక దోషమున్నను గన్పింపదు" అను సామాన్యము నిరూపింపఁ బడినది. అది బాగుగా బుద్ధిస్థము కానందున దానిని సమర్థింప "చంద్ర

కిరణములందు మచ్చకలదు' అని తిరోగ్య విశేషము ఉపమానరీతిని చెప్పఁబడినది.

అర్థాంతరన్యాసవిధి కుదాహరణము—

గీ. కాకమా! మావిపైనున్నఁ గోకిలమని
తలఁతు నినుఁ గూయకున్నచో; స్థలమహిమను
వస్తువుల కబ్బు కీర్తి; నేపాళవిభుని
నాసటి మన్ను కస్తూరిగా నుతిని గనదె!

ఇచటఁ గాకిని కోకిలముగా నెంచు విశేషమును సమర్థించు సామాన్యము 'స్థలమహిమనుబట్టి వస్తువులకుఁ గీర్తికలుగు' నని చెప్పఁబడినది. అదియు సులభముగా నరగామము కానందున, దానిని సమర్థించు మఱియొక విశేషము 'నేపాళరాజు నాసటిపై నున్నమన్ను అది కస్తూరిగా భావింపబడును' అనునది కూర్పఁబడినది.

## 63. ప్రౌఢోక్తి

గీ. హేతువులు కాని వుత్కర్ష హేతువులని
పల్కుచున్నఁ బ్రౌఢోక్తియై పరఁగుచుండు.

ఒక కార్యముయొక్క యుత్కర్షకొఱకు హేతువులు కానివానిని హేతువులుగ వర్ణించుట ప్రౌఢోక్తి యగును.

ఉదాహరణము—

గీ. మేటిజమ్మోటి యసటఁ గ్రొమ్మించు మించుఁ
బోదివి మదనప్రతాపాగ్నిఁ బుటము పెట్టి
తమ్మిగద్దియదాకట గ్రమ్మ యట్టి
కొమ్మఁ గావింపఁబోలు నెత్తెమ్మచూలి.

(వసుచరిత్రము)

వనితయొక్క సౌందర్యోత్కర్షలో జన్మెత్తియుండుట, గ్రహింపుచు
కుంచు పొందఁగునని కారణములు గాకున్నను కారణములైనట్లు చెప్పఁ
బడుట నిది ప్రౌఢోక్తి.

## 64. సంభావన

ఇట్టులైన నట్లగునని యెంచు నూహ
వెలయుచుండు సంభావనాభిఖ్య నొంది.

ఒకదాని సిద్ధికొఱకు "ఈ రీతిగనున్నచో అది యట్లగును" అని యూహించుట సంభావన యగును.

ఉదాహరణము —

క. కన్నెనగు హిమముతోడం
బున్నమచందురుని సాటిఁ బోలుపవచ్చున్
వెన్నుదురుతోడ మార్కొని
మున్నఁదలఁ జూడ లేక పోవకయున్నన్.

(విజయవిలాసము)

ఇచట 'వెన్నుదురుతోడ మార్కొని లేక పోవకయున్నచో నాతని నగుమోమునకుఁ జందురుఁడు సాటియగును' అని చెప్పఁబడినది గావున నిది సంభావన యగును.

## 65. మిథ్యాధ్యవసితి

గీ. ఒక్కదబ్బరకొఱకు వేఱొక్కటొంటఁ
జెప్పియున్న మిథ్యాధ్యవసితి పరఁగును.

మిథ్య యను నొక విషయమును సాధింప, వేఱొక యసత్యముఁ దార్చిన మిథ్యాధ్యవసితి యను నలంకార మగును.

ఉదాహరణము—

గీ. గొద్దురాలికిఁ గొమరుఁడై కొమరుమిగిలి
గగనకుసుమ స్రజంబులఁ గరము దాల్చి
పరఁగుచుండు మహాత్ముఁడే వన్ధ్యాయువతిఁ
దమవశంబున నిలుపఁగాఁ దగుదురెందు.

ఇచట వేశ్యను వశపఱచుకొనుట యసంభవము. దానిని సూచింప వంధ్యాపుత్రు లాకాశపుష్ప మాలికలఁ ధరించిన వటులఁ జేయఁగలరని చేసెడి యసంభవము వర్ణింపఁబడినది. అసంబంధమున సంబంధము కల్పింపఁబడి నందున నిది యతిశయోక్తియే కావలసియున్నది. కాని యొక యసత్యమును సాధింప జేసెడి యసత్యము కల్పింపఁబడుట యను విశేషము ననుసరించి, చమత్కృతి విశేషముగుట నిది యతిశయోక్తి కాఁజాలదని యెంచవలెను.

---

## 66. లలితము

ప్రస్తుత ప్రతిబింబమున్ వర్ణ్యమందు
వర్ణనము చేయ లలితాఖ్య వరలుచుండు.

ప్రస్తుతమగు విశేష్యమున, దాని కనుగుణమగు వృత్తాంతమును వర్ణింపక దానికిఁ బ్రతిబింబమగు నొక యప్రస్తుతవృత్తాంతమును వర్ణించుట లలితాలంకార మగును.

ఉదాహృతి—

గీ. కలికి! కను మీవు చేతులం గాలకున్న
యప్పుడే యాఁకులను బట్టుటొప్పుసుమ్మ!
జలము లింకిన వెనుకను జలముఁ బూని
వారధినిగట్ట నే రీతి ఫలము కలుగు?

ఇచట నొక నాయిక - తన సమీపమునకు వచ్చి బతిమాలిన నాయకునిఁ దిరస్కరించి, యతఁడు పోయిన పిదప విచారించుచుండఁ జెలికత్తె యీ ప్రస్తుతవృత్తాంతము చెప్పక (అనఁగా నీవు నాయకుని నుపేక్షించుట తప్పు అని చెప్పక) దానికిఁ బ్రతిబింబమాత్రముగ "పక్షి చేయుగాలిన పిదప ఆకులను గ్రహించినచో లాభమేమి? ఇది గతజలసేతుబంధనము" అను నప్రస్తుత వృత్తాంతమును వర్ణించుచున్నది కావున నిది అతికాలంకారము.

---

## 67. ప్రహర్షణము

గీ. అప్రయత్నముగ నెకోరునట్టి కార్య
సిద్ధి[1], వాంఛితమునకంటెఁ జెలఁగు వృద్ధి[2];
కార్యసిద్ధి యత్నంబును గడఁగుమాత్రఁ[3]
గృతులఁ జెలఁగుఁ బ్రహర్షణగతులు మూఁడు.

1. తన ప్రయత్నము లేకయే కోరిన కార్యసిద్ధియైనఁ బ్రహర్షణాలంకార మగును.

ఉదాహరణము—

గీ. ప్రాణనాయికఁ గాంచ నెప్పటికోయనుచుఁ
జింతలో మునిఁగియున్న నా చెంత కప్పు
డామె పంపిన దూతిక యరుగుదెంచి
మదికి నెంతయు సంతస మొదవఁజేసె.

ఇచట నాయకుఁడు తన ప్రియురాలిం గూర్చి యాలోచించుచుండఁగా, ఆ సమయముననే ఆమె పంపిన దూతిక వచ్చి యానందముఁ గూర్చెనని చెప్పుటచే ప్రహర్షణము.

2. కోరినదానికంటె నధికముగఁ గార్యసిద్ధి కలుగుట ప్రహర్షణ మనఁబడును.

ఉదాహరణము—

గీ. దప్పిఁగొను చాతకము జలదమును నాలు
గైదు జలబిందువులఁ గోర, నదియు విశ్వ
మంతటిని జలముల ముంచి యతిశయిల్లె;
గొప్పవారల త్యాగముఁ జెప్పఁదరమె!

ఇచటఁ జాతకములు నాలుగైదు జలబిందువులఁ గోరఁగా మేఘ మెక్కువగఁ గురియుట ప్రహర్షణ మగును.

3. కార్యము సిద్ధింపఁజేయు కారణమునకుఁ బ్రయత్నింపఁగా, కార్యము సిద్ధించుట మూఁడవ ప్రహర్షణభేద మగును.

ఉదాహరణము—

గీ. ప్రాణనాథునిఁ బిలువ నా ప్రాణసఖినిఁ
బంప మదిలోన నే నిశ్చయింప, నపుడె
అతఁడు వచ్చి నా తాపము నణఁచివైచె
పడఁతి! ఏమందు నాదు సౌభాగ్యగరిమ.

ఇచట నాయిక నాయకసమాగమమునకై యొక దూతిప్రేషణమునకై ప్రయత్నించుచుండ, అతఁడే వచ్చినట్లు వర్ణింపఁబడినది.

68. విషాదనము

గీ. కామ్యమునకు విరుద్ధమౌ కార్యసిద్ధి
అలరుచుండు విషాదన మనెడిపేర.

కోరినదానికి విరుద్ధమగు కార్య మగుట విషాదన మగును.

ఉదాహృతి—

శా. బాలా! రాతిరి నీవిభుండు రతిసంపర్కం బెఱింగించెనా!
ఏలాగాటఁ నెఱుంగనమ్మ! సదయుండై చీరకొంగంటు నే
నాలోఁ జంచల మంది దివ్వెకుఁ జెఱంగడ్డంబుగా నొడ్డ, నా
రాలే దివ్వెలుగా వెలింగెఁ జెలి! నేత్రద్వంద్వమున్ మూసితిన్.
(ఒకచాటువు)

ఇచట నాయిక దీపము కప్పింపఁదలఁచి చీరచెంగు నడ్డముగ నుంచినను హారమునే దీపముగ వెలిఁగి ఇష్టకార్యము కలుగకుండఁ జేసినట్లు వర్ణింపఁబడినది కావున నిది విషాదనాలంకారము.

---

## 69. ఉల్లాసము

తనరు నుల్లాసమయి యొక్కదాని దోష
గుణములను నన్యమున దోషగుణము లొప్ప.

ఒకదాని గుణదోషములవలన నింకొకదానికి గుణదోషములు కలిగిన నుల్లాస మగును. గుణమువలన గుణము కల్గుట, గుణమువలన దోషము కల్గుట, దోషమువలన దోషము కల్గుట, దోషమువలన గుణము కల్గుట నను రీతులచే నిది నాల్గు విధములు.

గుణమువలన గుణము కల్గుట కుదాహరణము—

క. పరమ పతివ్రత యనుచుం
ధర నెన్నికఁగన్నయాకె తద్దయు నాయం
దరయఁగఁ దానం బాడిన
కరము పునీత నగుదునని గంగ తలంచెన్.

ఇచట నొక పతివ్రతయొక్క పవిత్రత యను గుణముచే గంగకు గుణము కలిగినట్లు వర్ణింపఁబడియున్నది.

గుణములవలన దోషము కల్గుట కుదాహృతి—

క. జలరుహాక్షా! చలమున నీ
దళముల ముకుళింపఁజేసి దారి యిడనిచో
అళుల కొకహాని కలదే!
వలనుగఁ బూచిన రసాలవనము లుండంగన్.

(ప్రాస్తావిక పద్యావళి)

ఇచట భ్రమర సంహారగుణము. జలరుహాక్షునకు భ్రమరప్రీతి చేయుట దోషమట్లు చెప్పబడినది.

దోషములవలన దోషము కల్గుట కుదాహరణము—

గీ. కుచములందలి కాఠిన్యగుణముఁ బాద
పద్మములయందుఁ గోరుచుఁ బార్థివేంద్ర!
నీదు ధాటుల శాత్రవ నీరజాక్ష
నేత్రలు హిరణ్యగర్భు నిందింత్రు సతము.

ఇచట రాజు కోరఁడు యుద్ధమునకు రాఁగా, వనమునకుఁ బారిపోవుచున్న శత్రురాజవనితలు తమకుఁ బలాయనమున కనుగుణముగఁ బాదములందుఁ గాఠిన్యము నుంచక స్తనములయందే యుంచినందులకు విధాతను నిందించుట వర్ణితము. ఇచట పాదములందలి మార్దవదోషమువలన బ్రహ్మ నింద్యుఁడను దోషము స్పష్టముగనే యున్నది.

దోషములవలన గుణము కుదాహృతి—

చ. వననిధి! నీప్రవాళవన పంక్తికిఁ దే శుభ, మొక్కదండమా
మణులకు, భద్రమెల్లపుడు మానితమౌక్తిక శుక్తిమాలికిన్
మునుకొని నేఁడు సర్వధనముల్ గొనువల్లుతలంచి నెమ్మదిం
దనిసితి నీదు గర్భగత దారుణజంతుభయార్తిలేమిచేన్.

([illegible])

ఇచట సముద్రమునందలి జలచర దోషములవలన ధరిత్రి కేమియును గుణముగ వర్ణింపఁబడినది.

---

## 70. అవజ్ఞ

గీ. అగు నవజ్ఞ గుణము దోష మన్యమునకు
గుణము దోషముఁ గూర్పక కూర్పఁబడిన.

ఒకదాని గుణములవలన వేఱొకదానికి గుణము, ఒకదాని దోషములవలన వేఱొకదానికి దోషము కలుగకున్న నవజ్ఞాలంకార మగును.

గుణము కల్గకుండుట కుదాహృతి—

క. ఇత్తడి పుత్తడి యగునా!
తొత్తుకు వగ లెన్నియున్న దొరసానగునా!
ఉత్తమకులుఁడౌనా దా
లత్తునఁ దాఁ దిరిగినను గులాము గులామే!

(సూరకవి చాటువు)

ఇచట నుత్తమకులుని దాలత్తునఁ దిరుగుట యను గుణమువలన గులామునకు గుణము కలుగకుండుట వర్ణితము.

దోషము కల్గకుండుట కుదాహరణము—

అనుమానింపక యా సుధాంధసులు మాయాకల్పనామానసం
బున వైశ్వానరునిన్ హరించిరి యటంచో యింతమాత్రంబులో
నన నాయోగమహానుభావమునకున్ భంగంబు వాటిల్లునే!
సనికల్దాఁచినఁ బెండ్లి మానునొకొ! దుశ్చారిత్రముం గంటిరే!

(శాకుంతలము)

ఉదాహరణము—

క. వర సద్బ్రాహ్మణులయ్యును
మురియుచు స్వేచ్ఛానుసారముగ నేఁగఁగఁ బం
జరమున బంధము నిడిరి
వరమధుర మృదూక్తికును ఫలమా శుకమా!

(చంద్రికరాయ శతకము)

ఒకరాజు తనపుత్రుని దూరముగ నున్న రాజధానికిఁ బంపి రాజ కార్యములఁ జక్కఁబెట్టు నియమించెను. పుత్రుఁడట్లే మంచి రాజనీతి నెఱింగెను. ఒకసారి రాజు తన నగరమునుండి పుత్రునిఁ జూడ నా రాజధానికేఁగి యతనితో నీ క్రింది విధమున నప్రస్తుత ప్రశంసారూపముగ నిట్లు పలికెను. ఇచట నితరములగు పక్షుల మాటలు రాకను దోషముగ స్వేచ్ఛానుసారముగ నేఁగుట యను సుకార్యము కల్పింపఁబడినది. అట్లే చిలుకకుఁ – మధురభాషిత మను గుణమునకుఁ బంజరబంధము పొందు కగుట దోషత్వము కల్పింపఁబడినది.



## 73. ముద్ర

ప్రకృతమగు వర్ణమును దెల్పు పదము సూచ్య
మైన యర్థము సూచింప నగును ముద్ర.

ప్రస్తుతార్థమున కనుకూలించు పదములవలన సూచింపఁదగిన యర్థమును సూచించుట ముద్ర యనఁబడు.

ఉదాహృతి—

శా. సారంగంబగు తాటకేయుని మొదన్ శార్దూలవిక్రీతో
దారుండై చను దెంచు రాఘవుఁడు సీతాప్రేరణం జేసి తన్,

చేర వ్యాపించిన తమ్మునిం గని మదిం జింతాపరుండై దశా
గ్రీవుం డంత మెఱుంగ లేని మొగులై కంటం దడిన్నింపఁగన్.

(చంపూరామాయణము)

ఇచట "శార్దూలవిక్రీడితోదారుండై" అను ప్రస్తుతార్థపదము వలన సూచనీయమగు వృత్తనామము సూచింపఁబడినది.

---

## 71. రత్నావళి

గీ. ప్రస్తుతార్థములను గ్రమ మొప్పఁ గూర్చ
వెలయు రత్నావళి యటంచు వివిధకృతుల.

... ఏదైన నొక వరుస ననుసరింపక యర్థములఁ గూర్చిన రత్నావళి యగును.

ఉదాహృతి—

మహి మున్ వాగనుశాసనుండు సృజియింపంగుండలీంద్రుండు త
త్సహనీయస్థితి మూలమై నిలుప శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్యమూ
[illegible] హించెదన్.

(వసుచరిత్రము)

ఇచట సృష్టికర్త బ్రహ్మ, భూధర్త యనంతుఁడు, రక్షణచేయువాఁడు హరి, సోమసూర్యులు చంద్రసూర్యులు ప్రకాశకులనెడి క్రమముగ వాగనుశాసనుఁడు నన్నయ, కవిబ్రహ్మ తిక్కన, శ్రీనాథుఁడు,

నాచనసోముఁడు, భాస్కరుఁడు నను నాంధ్రకవీశ్వరులు తెలుఁగు నుద్ధరించినట్లు చెప్పఁబడినది కావున నిది రత్నావళి యగును.

## 75. తద్గుణము

అన్యగుణమును వీడి యన్యగుణమును గ్ర
హింపఁగాఁ దద్గుణంబయి యింపుఁ గూర్చు

తనయొక్క గుణమును వీడి మఱియొకదాని గుణమును గ్రహించినఁ దద్గుణాలంకార మగును.

ఉదాహరణము—

ఉ. అనిమిషస్థితి మాన్చి చిత్తరపుఁజూపస్వేదభావంబు గ్ర
ద్దన వారించి వినూత్నఘర్మజల విస్తారప్రపూరంబులో
డన దేవాంగనకయ్యెడ న్భ్రమరకీటన్యాయమై యొప్పియ
మ్మనుజేంద్రున్ భ్రమియించునంతనె రహిన్మర్త్యత్వమున్
సంధిలెన్.

(పరిలకథా సారసంగ్రహము)

ఇచట దేవాంగనకు దేవత్వము పోయి మనుజేంద్రుని భ్రమియించు కారణమున మనుష్యత్వము సంధిల్లినట్లు వర్ణింపఁబడినది.

## 6. పూర్వరూపము

గీ. తిరిగి స్వగుణముఁ బొందఁగాఁ బరఁగు పూర్వ
(రూపము)..........................

ఒకదానియొక్క గుణము పదార్థాంతరసన్నికర్షమున నుత్కృష్ట మగుట తద్గుణాలంకారము.

ఉదాహృతి —

క. తొలుతనె వానరము; ఆపయి
కల్లుద్రావి మదించె, తేలుకాటు తినియె; నా
వల దయ్యపుసోఁకుడఁ గనె;
తలమే యా కోఁతివైక్ల్యముఁ జెప్పంగన్!

వికారచేష్ట కోఁతి జాతికి స్వతస్సిద్ధము. కల్లు మొదలగునవి ఆ చేష్ట కుత్కర్షము కలుఁగఁజేసిన ట్లిచట వర్ణింపఁబడినది.

## 79. మీలితము

పోలికవలన భేదము తేలకున్న
మీలితాలంకృతి యగుచు లీలఁ జెలఁగు.

పరస్పరము పోలిక యుండుటంబట్టి భేద మేమాత్రము గోచరింపక యున్నచో మీలితాలంకార మగును.

ఉదాహరణము —

మ. వలిపము గట్టి పోఁకములు వైచి పటీరము మైనలంది జా
దులు నెఱిఁగొప్పునం దుఱిమి త్రోవ నపోయిరి మీనిశాఁకియుం
దలఁచెడివారు లేరని ముదంబునఁ గల్గలు దేర్చి జారకాం
తల సమయస్థలంబులకుఁ దార్చిరి దూతిక లట్టి వెన్నెలన్.
[పారిజాతాపహరణము]

ఇచటి పదార్థము లన్నియుఁ దన్నిని యొకటచేఁ గాంతిచే నిందు కాన్తులలో గాంతులచేఁ దాఁకింపఁబడినను దెలియఁగారు రని యభేదభావము వర్ణింపఁబడి యున్నది.



## 80. సామాన్యము

గీ. పోలికను విశేష మే మాత్రమును గలుగక
యున్న సామాన్య మనుపేర నొప్పుచుండు.

పరస్పరసామ్యమువలన విశేష మే మాత్రమును లేకయున్నచో సామాన్యాలంకార మగును.

ఉదాహరణము —

గీ. రతినకుంబములందు సంక్రాంతములయి
వేలకొలఁదిగఁ గల ప్రతిబింబములను
ఆ సభామంటపంబున నంగదుండు
దశముఖుని గనుఁగొనలేక దలఁచెఁ గాదె.

ఇచట రావణప్రతిబింబములకును, అతనికిని విశేషము లేనట్లు చెప్పఁబడుచున్నది కావున నిది సామాన్యము.



## 81. ఉన్మీలితము

వెలయు నున్మీలితము భేదవిలసనమున.

గుణసామ్యమునుబట్టి రెండు వస్తువులకు భేదము కానఁబడక యున్నను ఏదియో హేతువునుబట్టి భేదము స్ఫురించినచో ఉన్మీలితాలంకార మగును. ఇది మీలితమునకుఁ బ్రతిద్వంద్వి యగుచున్నది.

2. ప్రశ్నమునకు ప్రశ్నమే యుత్తరమైనను (ప్రశ్నోత్తరములకు భేదము లేకున్నను) రెండు ప్రశ్నల కొక్కటే సమాధానమైనను, విచిత్రమగు నదియు నుత్తరాలంకార మగును.

ఉదాహరణము—

క. హరునకు వాహన మెద్దగు?
గిరిరాట్సుత దేహకాంతి? గృహనిర్మితిలోఁ
గరము ప్రధానము? కప్పన
వరలెడు నుత్తరమటంచుఁ బ్రాజ్ఞులు మెచ్చన్.

ఇచట శివునకు వాహనము ఏది అగునని ప్రశ్నము. దానికి ఎద్దు అగునని (ఆ ప్రశ్నయే) సమాధానముగు మన్నది. పార్వతి దేహకాంతి ఏదనియు, ఇల్లు కట్టుటలో ముఖ్యమగు నంగ మేదనియు రెండు ప్రశ్నలకు "కప్పు" అని యొక్కటే సమాధానము. పార్వతి పక్షమున నలుపనియును, గృహవిషయమునఁ బై కప్పనియు నర్థము విచక్షణతో గ్రహింపవలయును.

---

## 84. సూక్ష్మము

గీ. పరుని యాశయ మెఱిఁగి యవ్వానిఁ గూర్చి
సల్పు సాకూత చేష్ట సూక్ష్మం బటండ్రు.

ఇతరుని యభిప్రాయ మెఱిఁగి తదభిప్రాయానుసారముగ నభిప్రాయగర్భితమగు చేష్ట నొనరించిన సూక్ష్మాలంకార మగును.

ఉదాహృతి—

గీ. విటుఁడు సంకేతసమయము వేఁడియుండ
మానసము గల్గియుండుట మగువ యెఱిఁగి

గనుఁగవను నవ్య తాలాంకఁ గయుఁజెలంగు
పద్మాక్షిముల మూసె విభ్రమము దెలఁగ.

ఇచట విటుఁడు సంకేతసమయము నెఱుఁగఁ గోరుచున్నాఁడని దాని యువిద యెఱిఁగి పద్మదళములను మూసి రాత్రియే సమయమని తన యభిప్రాయము వానికిఁ దెలియఁజేసెను. కమలములు రాత్రి ముకుళించుట ప్రసిద్ధము.

---

## 85. పిహితము

పరుల చేష్ట నెఱిఁగినవారిచేష్టి
తమ్ము సాకూతమై పిహిత మ్మనఁదగు.

పరులు చేసిన పని నెఱింగి, దానిని మాటలచేఁగాక సాభిప్రాయము గు చేష్టచేఁ దా నెఱిఁగినట్లు తెలియఁజేయుట పిహితము.

ఉదాహృతి—

గీ. మగువనును జెక్కుటనగు చెమ్మటలనీటఁ
గంతమందలి కుంకుమ కరఁగిపోవఁ
జెలువ పురుషాయితంబును దెలుప నెంచి
ఖడ్గమును వ్రాసెఁ జెలి యామె కరతలమున.

ఇచట నాయిక పురుషాయితము నొనర్చుటం దెలిసికొని, ఆమె చెలికత్తె మాటలచేఁగాక, "నీవే దినమునఁ బురుషుఁడ వైతివి" అను నభిప్రాయముం దెల్ప ఖడ్గచిత్రము నామె కరతలమున లిఖించి యామె పురుషాయితమును వ్యక్తపఱచినట్లు వర్ణింపఁబడినది. కాన నిది పిహితాలంకార మగును.

---

## ౮౬. వ్యాజోక్తి

గీ. అన్యహేతూక్తి చెప్పి యథార్థమైన
యాకృతిం గప్ప వ్యాజోక్తి యగుచుఁ దనరు.

యథార్థమగు అంశమును గప్పిపెట్టి మఱియొక హేతువును చెప్పి సమర్థించుట వ్యాజోక్తి యగును.

ఉదాహరణము—

గీ. పొలఁతి కెమ్మోవి నొక్కులు కలిగియుండఁ
గాంచ నెవరికిఁ గోపంబు కలుగకుండు!
వలదనుచుఁ బల్కుచున్నను భ్రమరి కల్గు
పద్మమేలని మూర్కొంటి పడఁతి యిపుడు!

ఉపపతిచే ఖండితాధర యగు నొక నాయికదరి కామె మగఁడు వచ్చుచుండఁగా, ఆమె చెలికత్తె యాతనిం జూడనట్లు నటించి నాయికకు హితోపదేశము నొనర్చు నెపమున నాయికయొక్క అపరాధము నిటుఁ గప్పిపుచ్చుచున్నది.

---

## ౮౭. గూఢోక్తి

ఒక్కనింగూర్చి చెప్పెడి మాటను మ
ఱొకనిగూర్చి చెప్ప గూఢోక్తి యగును.

ఒకనిఁ గూర్చి యొక విషయముఁ జెప్పఁదలంచియు నట్లు చెప్పినచో నితరు లెఱుఁగుదురని శంకించి, వేఱొకనిఁ గూర్చి నెపముతోఁ జెప్పుట గూఢోక్తి యగును.

ఉదాహరణము—

మొగఁడు బజారు కేఁగె, వినుమా! గణియింపదు నా సపత్ని నన్
బగఁ గొని నల్లపువ్వవలెఁ జూసి గురుల్ గృహమందె యుండ్రు; పోఁ
దగదనరీతి బానిసలు తామును రారటు, వేళ దిక్కులే
దగతికిఁ బ్రోవ నీవొకఁడ వగ్గతముండవు జానకీపతీ!

ఇచట జానకీపతి యను జారుని రాకం గోరు జార - పరమైనఁగ వెంట భగవంతుని ప్రార్థించు నెపమున గూఢముగఁ బిలుచుట వర్ణితము.

## 88. వివృతోక్తి

కం. శ్లిష్టగుప్తముఁ గవి వేఱొరులఁ దెలియఁ
జేయ వివృతోక్తియై కృతిఁ జెలఁగుచుండు.

శ్లేషచే గుప్తమగు వస్తువును, కవి యొకానొక విధమున వెల్లడించిన వివృతోక్తి యగును. అది శబ్దార్థశక్తులచే ద్వివిధము.

అందర్థశక్తి మూలమగు గుప్తార్థమును బ్రకాశింపఁజేయు నుదాహృతి—

ఉ. మాయలకృష్ణ! నిన్గనినమాత్రన నేమి సుఖంబు? పోదునే
నీయొకనున్న లాఁతిదను వింతయుఁ జెడ్డవలఁతు రంచు నా
తోయజనాక్షి రాధ తన దుస్సహవేదన వెల్లడింపఁగాఁ
దీయని ప్రేమనామెం గతిఁ దేల్చె శ్రీకృష్ణుఁడు మిమ్ము గోముతన్.

ఇచట రాధ పలుక్కు మాటలచే "నిన్నుఁ గలయు నభిప్రాయ మానార్యము పెంపొంద నే" యను వస్తు అర్థశక్తిమూల వ్యంగ్య మగుచున్నది. అది కవిచే "రాధ తన దుస్సహవేదన వెల్లడింపఁగా" అని వెల్లడింపఁబడుటచే నిది వివృతోక్తి యగుచున్నది.

ఇట్లే శబ్దశక్తిమూలమున కుదాహరణము లూహించునది.

లోకమునందలి ప్రవాదము ననుకరించి చెప్పుట లోకోక్తి.

ఉదాహృతి—

గీ. అవల వేయానబద్ధము లాడియైన
నొకట పెండ్లి చేసిన నది యుచితమంద్రు
కాన నెలుతైన మద్రభూకాంతుకోడఁ
బాసఁగ మాటాడుఁడని మునిఁబోవఁబనిచి.

(సావిత్రీ చరిత్రము)

ఇచట వేయి యనృతము లాడియైన నొక పెండ్లి చేయవలె నను లోకమర్యాద తెలుపఁబడినది.

---

## 91. ఛేకోక్తి

మీఁది లోకోక్తి యర్థాంతరాదరమునఁ
జెంగియున్న ఛేకోక్తియై వెలయుచుండు.

లోకోక్తియందు వేఱొకరీతి యర్థముఁ గల్పించిన ఛేకోక్తి యగును.

ఉదాహరణము—

గీ. జలద! నీ వుగ్రహించిన మలయపవన
మల్లికాసురభి యగు గ్రీష్మబు ధన్న
మౌను; సతిఁ బ్రియుఁ గూర్చుము! గోనివర్త
నము నొనర్చినవాఁడె ధనంజయుండు.

ఇచ్చట "గోవులను మళ్లించినవాఁడే యర్జునుఁడు" అని లోకోక్తి "సౌందర్యశాలి యగు ప్రియురాలిని విడిచి ధనార్థియై దేశాంతరమునకు వేఁగిన ప్రియుని ప్రియురాలితోఁ గూర్పు" మని యొక చెలికత్తె మేఘుని

కూర్చి చెప్పెడి విషయము ప్రస్తుతము. దీనింబట్టి మీఁది లోకోక్తి కర్థాంతరముఁ గల్పింపఁబడుచున్నది. ధనము కోరి ప్రియుని విడుచువాఁడు గోసన్యాసుఁడు తానిని స్వప్రయత్నమునుండి మళ్లించుటకు ధనములను ఇయించినవాఁడే సమర్థుఁడని యిచటి యర్థాంతరము.

---

## 92. వక్రోక్తి

గీ. అమరు వక్రోక్తి యగుచు నర్థాంతరంబు
శ్లేష కాకువులం గృతిఁ జెలఁగియున్న.

శ్లేషచేఁగాని, కాకు స్వరముచేఁగాని, యర్థాంతరముఁ గల్పించినచో వక్రోక్తి యగును.

శ్లేష కుదాహృతి—

చ. అపరిమితానురాగ సుమనోఽలసయై చిగురాకుఁ జేతులం
దపసిని గాఁగిలించ వనితాయిదె రంభ తలంప, రంభ తా
నపరిమితానురాగసుమనోఽలసయై చిగురాకుఁ జేతులన్
దపసినిగాఁగిలించుటుచితంబెగదాయనినవ్వె రంభయున్.

(వసుచరిత్రము)

ఇచటి రంభ తపసి పదములు శ్లిష్టవాచకములై యుండఁగా వానికి రంభ యను నప్సరస, ముని యను నర్థాంతరములు శ్లేషమహిమచేఁ జెప్పఁబడినవి.

కాకువున కుదాహృతి—

ఉ. నావుడు నిట్లనుం గపిల నావచనంబు లపార్థకంబులే!
నీవు వివేకశీలుండవు; నీ విటులాడుట యుక్తమే! వసుం

కోవిదు మంట నిన్నొలఁగి పోవుటకే! పదివేలు చెప్పినన్
భావలయంబులోఁ బలికి బొంకుటయుం బ్రదుకే! తలంపఁగన్.

(భోజరాజీయము)

ఇచట "అనర్థకంబులే" అన అనర్థకములు కావనియు, "యుక్తమే" అన యుక్తము కాదనియు, "తొలఁగి పోవుటకే" యన తొలఁగి పోవుటకుఁ గాదనియు, "బ్రదుకే" యన బ్రదుకు కాదనియు వర్థాంతరములు కాకుస్వరమువల్లఁ గల్గుచున్నవి.

## 93. స్వభావోక్తి

అది స్వభావోక్తి యగును జాత్యాదికముల
వర్ణన స్వభావయుక్తమై వరలుచున్న.

జాతిగుణక్రియాద్రవ్యముల వర్ణన స్వభావసిద్ధమైన దగుచో స్వభావోక్తి యను నలంకార మగును.

జాతివర్ణనమున కుదాహరణము__

వలపల డాపలన్ వరుస వాలుఁగ ముంగొనఁ జూపులార్చుచున్
తిలకము దీర్చుచున్ గురుల దీటుచు వీనుల మానికంపుటా
కులపారి ద్రిప్పుచున్ దళవకోరకము ల్వెలయంగ మోవి పెం
పొరయఁగ మోము విచ్చుచును నద్దముఁ జూచె నొకర్తు
[వేడుకన్.

(నృసింహపురాణము)

ఇచట నొక విలాసవతి (జాతి) స్వభావము వర్ణింపఁబడియున్నది.

## 94. భావికము

ఆ. భావికంబగు భూతము భావియునగు
దాని వర్ణన సాక్షాత్తుగా నొనర్ప.

జరిగినదానిని గాని జరుగనుండినదానిని గాని ప్రత్యక్షముగ నున్నట్లు వర్ణించిన భావికాలంకారమగును.

ఉదాహరణము—

గీ. పడఁతి! పొలయల్క నీవు నాపజ్జఁ జేర
కున్న నిను నేను బతిమాలుకొన్నరీతి,
నీవు దయఁబూనురీతియు నిప్పటికిని
గన్నులకుఁ గట్టుచుండు నిక్కమిది సుమ్ము!

ఇచట నెపుడో జరిగిన ప్రణయకలహవృత్తాంతము ప్రత్యక్షముగ వర్ణితమైనది.

---

## 95. ఉదాత్తము

ఋద్ధిచరితము, శ్లాఘ్యమై యొసఁగునది యి
తరమునకు నంగమగుట యుదాత్తమగును.

1. సమృద్ధమగు వస్తువుచరిత్ర ముదాత్తమగును.

ఉదాహరణము—

సీ. నారంగములు వాసనారంగములు కొన్ని
యళినాదమంత్రముల్ దెలుపుచోటఁ
దిలకంబు లవనీతిలకంబు లవి కొన్ని
ప్రసవాసవార్ఘ్యము లొసఁగుచోటఁ

.. గాంచనంబులు వన్నె కాంచనంబులు కొన్ని
కలికాప్రదీపికల్ నిలుపుచోట
సహకారములు చైత్ర సహకారములు కొన్ని
తలిరాకుటారతుల్ నిలుపుచోట.

గీ. ముప్పిరిఁబెనంగి ద్రాక్షలు గప్పికొనిన
గొప్పకప్రంపుటనఁటుల చప్పరాల
నొప్పరాలిన కప్పురా లుప్పరాలఁ
బెనఁచు వలిగాడ్పుధూప మర్పించుచోట.

(వసుచరిత్రము)

ఇచటఁ బూజ కగు వస్తుసమృద్ధి వర్ణింపఁబడినది.

2. శ్లాఘ్యమగు చరిత్ర మితరముల కంగభూతమైన నుదాత్తాలంకార మగును.

ఉదాహరణము—

ఉ. భూరితరాభ్రవిభ్రమము పుష్కరరమ్యకరంబు, దాన ల
క్ష్మీరుచిరంబు సత్త్వగుణకీర్తితమూర్తియు వాలిసాలసం
హారవిహారకారణమునా రఘుకుంజరభర్త ముష్న సం
చార మొనర్చె నీయచల సానుతలంబున నంబుజాననా!

(పాండురంగమాహాత్మ్యము)

ఇచట శ్లాఘ్యుఁడగు శ్రీరాముని చరిత్రము సానుతలమున కంగముగఁ గూర్పఁబడినది.

---

## 98. అత్యుక్తి

గీ. అద్భుతము మిథ్యయునగు శౌర్యాదివర్ణ
నంబు కృతుల నత్యుక్తియై డంబు మిగులు.

అద్భుత మగు రీతిని శౌర్యౌదార్యాది సంపదాది వర్ణనము యథార్థము కానిదానిని వర్ణించిన అత్యుక్తి యగును.

ఉదాహరణము—

స్థిరసౌధాగ్రవిహారయావతరతిచ్ఛిన్నాచ్ఛహారస్ఫుర
ద్గురుముక్తాతతిఁ జేటికల్ విరులతోఁ గూడంగఁ ద్రోయన్నిశో
దరలగ్నంబగు దాని నెమ్మొగు లధఃస్థంబై తటిన్ రాల్ప నా
కర మర్థంబనియెంద్రుగా కుదధిఁ దక్కన్ బుట్టునే ముత్యముల్!
(ఆముక్తమాల్యద)

ఇచట స్త్రీలు పూలతోఁ గూడ ముత్యములను త్రోయఁగా వని మేఘముల చిక్కుపడిన వనియు, నీటిబిందువులతోపాటు రత్నములు మేఘములనుండి పడుటచే మేఘములు ముత్యములకు స్థానములని పేరు పొందిన వనియు వర్ణింపఁబడినవి. ఇది యసత్యమైనను, అద్భుతముగ నున్నది. ఇది సంపద్విషయమున నుదాహృతి. తక్కినవానింగూడ నిట్లే గ్రహించునది.

## 97. నిరుక్తి

యోగబలమున నన్యార్థయోజనంబు
కల్పనంబు నిరుక్తియై పొల్పుమీఱు.

యోగరూఢమగు పదము రూఢ్యర్థమునందే ప్రసిద్ధమైనను, యోగార్థ బలమున నచ్చట అర్థాంతరముఁ గల్పించిన నిరుక్తి యగును.

ఉదాహృతి—

భూమియు నాకసంబు తమపొంకమున న్నిగిడించు తత్పురీ
సామజకోటి యున్నతికి సర్వజగంబులఁ గల్గు నున్నతుల్—

ధామము డింది వామనతఁబూనఁగ దక్షిణదిక్కునేఁగున్
వామనమంచు నాడఁదగదా! తగవాడరుగాక భూజనుల్.

(పాండురంగ మాహాత్మ్యము)

దక్షిణ దిగ్గజమునకు వామన మను పేరు రూఢమైనది. కాని యిచట "పొట్టిగా నుండునది" అను విశేషార్థము యోగమువలన గ్రహింపఁబడినది.

---

## ౯౮. ప్రతిషేధము

గీ. తెలిసిన నిషేధము తిరిగి తెలుపఁబడిన
వెలయుఁ బ్రతిషేధ మగుచును లలితరీతి.

ఏదైన నిషేధము ప్రసిద్ధమై యున్నను, దానిని తిరిగి చెప్పుట ప్రతిషేధము. ఆ తిరిగిచెప్పుట వ్యర్థమై యర్థాంతర ప్రతీతిం గలుగఁజేయును.

ఉదాహరణము—

గీ. విషముచే హేతిచే జాతవేదుచేత
మిత్తిచేఁ గాదు పడఁతి యుత్పత్తిఁ గనుట;
అప్రతీకారపరుషమై యలరుకతనఁ
బడఁతిచేతనె సృజియింపఁబడుట నిజము

ఇచట స్త్రీలు విషాదులచేఁ బుట్టింపఁబడకుండుట ప్రసిద్ధము. కాని తిరిగి చెప్పఁబడిన యీ నిషేధము స్త్రీలు విషాదులకంటెను అధికమగు క్రౌర్యము కలవారను నర్థాంతరమును దెలుపుచున్నది. "అప్రతీకారపరుషమై యలరుకతన" అను విశేషణము విషాదులకుఁ బ్రతీకారము కలదనియు, స్త్రీలకుమాత్ర మట్టి ప్రతీకారము లేదనియు నిచటి విశేషము.

---

## 99. విధి

ప్రథితమైయున్న సిద్ధినే పల్కియున్న
వెలయు విధి యను సంజ్ఞను వివిధకృతుల.

ఒకదాని విధి ప్రసిద్ధమై యున్నను తిరిగి దానిని విధించుట విధి యగును. ఆ విధి యక్కఱలేకున్నను అర్థాంతరమును బోధించుట కుపయోగించును.

ఉదాహరణము—

సీ. నీవు మాటలు నేర్పి నెమ్మితోఁ బ్రోదిన
చిల్క చిల్కగుఁజుమ్మి చిగురుఁబోఁడి!
నీ వాట దిద్ది మన్నించి పెంచిన బర్హి
బర్హియౌఁ జుమ్మి కంపాలతాంగి!
నీకోలంకునఁ జేరి నెక్కొన్న కోకంబు
కోకమౌఁ జుమ్మి చకోరనయన!
నీతోఁట మధు వాని నీటు గాంచిన యళి
యళి యగుఁజుమ్మి మత్తాళివేణి!

గీ. దైవబల మేరికి నొకింత తప్పనేని
ప్రాణబంధువు లైనను బగతు రగుదు
రింతి! యటుగాన వేగ నన్నేలుకొనుము
కాయజుఁడు ని న్జెనకకుండఁ గాఁచువాఁడు.

(రసికజన మనోభిరామము)

ఇందుఁ జిలుక చిలుక యగు నని చెప్పనక్కఱలేదు. కాన రెండవ 'చిలుక' అను పదము విశేషార్థమును బోధించుచున్నది. ఇట్లే బర్హి, కోకము, అళి యనునవియును విశేషార్థ బోధకము లయి యున్నవి.

ఇందొక నాయకుఁడు తాను ప్రేమించిన సుందరాంగితో పలుకు చున్న మాటలతో నీ పద్యము కూర్పఁబడినది.

'ఓ యింతీ! నీవు నన్నేలుకొననియెడల నీవు పెంచిన చిలుక మన్ననుగనదియే నీకు శత్రువు అగును. నీవు పెంచుటవలని కృతజ్ఞతతో అది నిన్ను బాధింపదని యనుకొనుచున్నావేమో! అది పొరపాటు. స్వభావముచేతనే యది విరహిజన హింసాకరము అగును' అని యుచట స్ఫురించుచున్నది.

ఇచ్చోట విశేషార్థములును కలవు. 'చిల్కగుఁ జామ్మ' యనుచో 'చిల్క+అగుఁ జామ్మ' అని విడఁదీసినచో 'బాణ' మని యర్థము వచ్చును. చిలుక బాధను కల్గించు బాణమువంటి దగునని వ్యంగ్యము. 'బర్హి' పద మునకు చేయి మున్నగు వానిని తెగఁగోయు 'దస్యు' అనియు అర్థము. ఇట్లే 'కోకము'నకు 'తోఁడేలు' అనియు, 'అళి' అను దానికి 'తేలు' అనియు నర్థాంతరము ఉండుటచే అవియు బాధను కల్గించునని యను వ్యంగ్యము తోఁచుచున్నది.

---

## 100. హేతువు

గీ. హేతుమంతముతోఁ గూడ హేతు వెచటఁ
జెప్పఁబడు నది హేతువై చెన్నుమిగులు.

హేతుమంతముతోఁ గూడ హేతువును వర్ణించిన హేత్వలంకార మగును.

ఉదాహరణము—

గీ. కడచి యేసనా రాతిరి కమలబంధు
నధిక విరహార్తిఁ గృశియించు నబ్జకాంత

నుదయమునఁ గాని యల్లనఁ బదము లంటి
తన్వి! నేఁడెను దర్పితపాదంబులొత్తు.

ఇచట హేతు వగు నేఁడుట హేతుమంతము ప్రకాశముతోఁ గూడ వర్ణింపఁబడి యున్నది. కావున నిది హేత్వలంకార మగును.

హేతు వదియును నగు హేతు హేతుమంత
ముల కభేదము కృతులందు వెలసియున్న.

హేతు హేతుమంతముల కభేదము వర్ణింపఁబడినను హేత్వలంకార మగును.

ఉదాహరణము—

దేవ బ్రాహ్మణభక్తి ప్రౌఢి ప్రియవక్తృత్వంబు దానాది వి
ద్యావైదుష్యము దిక్కు ధర్మమున కుద్దామాగ్రణి మర్యాదకున్
దా వాచిత్యము కీర్తి గల్గు హితశిష్టవ్రాతసంతోషణ
శ్రీవర్ధాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే చూడఁగన్!

(విజయవిలాసము)

ఇచటఁ గారణములు యుధిష్ఠిరునకును, భక్తిప్రౌఢి మొదలగు కార్యములకును, (హేతు హేతుమంతములకు) అభేదము చెప్పఁబడి యున్నది. కావున నిదియు హేత్వలంకార మగుచున్నది.



# అనుబంధము

## I

## మూలగ్రంథమునందలి కొన్ని క్లిష్టచర్చలు

---

### 1. దీపకము

ప్రస్తుతమునకు, నప్రస్తుతమునకుఁ గలిపి ధర్మసామ్యమును చెప్పినచో దీపకాలంకారమగునని చెప్పంబడినది.

అ. పండితుండు శూరవరుఁడు పరులసేవ
యందు దిట్టతనము నందువాఁడు
స్వర్ణపుష్పయైన వసుధను కోయఁగా
వంచితగతి మదిఁ దలంచుచుండ్రు.

ఇదియు దీపకోదాహరణము. ఇచట పండితుఁడు సేవకులగువారిలో కొఁడు ప్రస్తుతుఁడనియుఁ, దక్కినవా రప్రస్తుతులనియు తెలుపఁబడినది. కాని ఇచట ధర్మము తొలుత ప్రస్తుతమునను, అపిదప నప్రస్తుతమునను సమన్వయించలేదు. ప్రస్తుతాప్రస్తుతములం దొక్కసారియే యన్వయించుచున్నది. కావున నియ్యది దీపకోదాహరణము కాఁజాలదేమో యని సందేహము కలుగవచ్చును. కాని ప్రస్తుతాప్రస్తుతములందు ధర్మ మొక్కసారియే యన్వయించుట దీపకమునకు ప్రతిబంధింపఁజాలదు. మేడయందలి దీపము మేడను, వీథిని నొక్కసారియే కాంతి నిచ్చును గాని తొలుత

చూడక, పిదప పీఠికి తెలుఁగు నిచ్చుటలేదు. అల్లుఁడు వచ్చునని పిండి వంటలు వండినను, అతిథులకుఁ దొలుత వడ్డించుచుండుట కలదు అచట నప్రస్తుతమునందుఁ దొలుతయు, ప్రస్తుతమున నా పిదపను ధర్మ మన్వయించుచున్నది. కావున ధర్మము ప్రస్తుతాప్రస్తుతము లందొక్కమాఱుగ నన్వయించినను, తొలుత అప్రస్తుతమునను పిదప ప్రస్తుతమునను సమన్వయించినను దీపకము కావచ్చును.

తుల్యయోగితయం దొకటి ప్రస్తుతము, తక్కిన వప్రస్తుతములు నను భేదము లేదు. దీపకమున నట్టి విశేషము కలదు. ఈ రెం డలంకారము లందును ఉపమాలంకారము గమ్య మగుటలో భేదము లేకున్నను దీపకమునఁ ప్రస్తుత ముపమేయము, అప్రస్తుత ముపమానము. తుల్యయోగితాలంకారమున నేదేని యొకటి యుపమేయము, తక్కిన దుపమానము నగును. ఉపమానోపమేయభేదముంబట్టి దీపక తుల్యయోగితలకుఁ గల భేదమును గుర్తింపవలెను.



## 2. ప్రతివస్తూపమ

అర్థావృత్తి దీపకమునందును ప్రతివస్తూపమయందువలె ధర్మము పేర్వేఱుగ నుండును. కాని యీ రెండిటికిని గొంత భేదము కలదు. అర్థావృత్తి దీపకమునఁ గేవలవర్ణ్యములు గాని, అవర్ణ్యములు గాని వర్ణింపఁబడును. ప్రతివస్తూపమయందు ఒకటి వర్ణ్యము, తక్కిన దవర్ణ్యములు. ఈ రెండింటికిని మఱియొక భేదము కలదు. అర్థావృత్తి దీపకము సాధర్మ్యముననే కుదురును. ప్రతివస్తూపమ వైధర్మ్యమునఁగూడ నుండును. ధర్మము సమానముగ నుండుట సాధర్మ్యమనియు, సామ్యమర్థసిద్ధ మగుచున్నను ఒకదాని ధర్మ మొకరీతిగను, వేఱొకదాని ధర్మ మింకొకరీతిగను వర్ణించిన నది వైధర్మ్యమనియుఁ జెప్పఁబడుచున్నది.

ప్రతివస్తూపమ వైధర్మ్యమున నుండుట కుదాహరణము—

గీ. పాలఁబుట్టిన మాత్రాన మేలిగుణము
లేదు నీ కేలఁగల్గు నో నీరజారి!
నీటఁబుట్టినవాఁడు కాఁడోటు వహ్ని
కాల్చుచున్నాఁడు జగములు కరుణ లేక.

(మనుచరిత్రము)

ఇందొకచో మేలిగుణము కలుగదనియు, మఱియొకచోఁ గాల్చుచున్నాఁడనియు విరుద్ధధర్మములు విభిన్నములుగఁ జెప్పఁబడినవి. కొంతమామీఁద నిచట విరుద్ధమగు ధర్మ మొక్కటే కాల్చుచుండుటయే! ఆవృత్తి దీపకమున నిట్టి వైధర్మ్యము కానరాదు.

## 3. సమాసోక్తి

సమాసోక్త్యలంకారమున స్ఫురించు నప్రస్తుత వృత్తాంతము ప్రస్తుతమునకుఁ గొంత శోభను జేకూర్చుచున్నది. కావున నీ యప్రస్తుత వృత్తాంతము ప్రస్తుత విశేష్యమునం దారోపింపఁబడుచున్నదని చెప్పవలెను. ప్రస్తుతముతో సంబంధింపని వృత్తాంతమువలనఁ బ్రయోజనమేమియుఁ గలుగదు. కావునఁ బ్రస్తుతమున నప్రస్తుత వృత్తాంత సమారోపమే సమాసోక్తియందుఁ గలదని తెలిసికొనవలెను. కాని, రూపకాలంకారమందువలెఁ బ్రస్తుతమున నప్రస్తుత స్వరూపసమారోపముమాత్రము కాదు. "ఆమె మొగము చందురుఁడు" అను రూపకమున ముఖమునందుఁ జంద్రత్వ మారోపింపఁబడి యున్నది. ఆ యారోపణ చేయుటలోఁ గారణమగు చంద్రపదము—అచట లేఁగ నున్నది. ఈ సమాసోక్తియం దట్లుకాదు. 'పూట పూట కరత్కోటి' అను పద్యమునఁ గన్యయందు

పతిత్వ మారోపింపఁబడి యున్నచో తద్వేతుకగు పదితరము కేవలగ నుండ వలెను. అది లేదు కావున నిచటఁ బ్రస్తుతమునం దప్రస్తుతారోపము సరిపడదు. కన్యాశబ్దము కన్యాకుమారీకము కాక పతికుమారీకము కూడఁ జెప్ప సమర్థమై యున్నదా! లేదు. కన్యాశబ్దమునకు "పతి" యను నర్థము కానరాదు.

"రాత్రియందు మెఱుపుకన్నులతో నభిసారికాముఖమునంజూచి వర్షధారలతోఁ గాటు చంద్రుఁడు కూడ జారిపడెనా యేమి! అని మేఘము రిమెను" అను నిది యేకదేశవివర్తి రూపక మగుచున్నది. అన్నిస్థలములను రూపకముఁ జెప్పక యేదో ఒక్కచోటనే నిబంధించినయెడల ఏకదేశవివర్తి రూపక మగును. ఇచట మెఱుపుకన్ను అని యొక్క రూపకమే కలదు. కాంతనియున్నను మేఘపురుషుఁడు అను రూపకము లేదు. మెఱుపు కన్నుగా మారినపుడు మేఘము కూడ ఒక పురుషుఁడుగ మారవలెను. ఆ రూపక మిచట అర్థసిద్ధము కాని శబ్దోపాత్తము కాలేదు.

రూపకమునందుఁ బ్రస్తుతాప్రస్తుతములు రెండును శబ్దప్రతిపాదితములై యుండునవియు, సమాసోక్తియం దప్రస్తుతము శబ్దోపాత్తము కాఁజాలదనియు నిదివఱలోఁ జెప్పఁబడినది. ఇచట మెఱుపునందు నయనత్వారోపము చేయఁబడినది కాన రెండును శబ్దప్రతిపాదితములై యున్నవి. కాని మేఘమునం దారోపింపఁబడిన ద్రష్టృపురుషత్వ సమారోపమునకు హేతువగు ద్రష్టృపురుష పదము వేఱుగ లేదు. ఇచట నది (అప్రస్తుతము) శబ్దప్రతిపాదితము కాకున్నను రూపకాలంకార మగునని చెప్పఁబడుచున్నది. దీనింబట్టి అప్రస్తుతము గమ్యమానమైనపుడు కూడఁ బ్రస్తుతమునం దప్రస్తుత మారోపింపఁబడినట్లు తెలియను. ఈ రూపకము రీతినే సమాసోక్తియందును, ప్రస్తుతమునం దప్రస్తుత సమారోపము కలదని చెప్ప వీలగుచున్నది.

విచారించి చూచినచో నిది సరికాదు, ఏలఁ అనగా రూపకమునం దొక విశేషమున్నది. అచట ద్రష్ట యగు పురుషుఁడు శబ్దోపాత్తుఁడు కాకున్నను అపేక్షితసిద్ధుఁడు కాఁగలఁడు. ఇచటఁ గల "చూచుట" మేఘ మొనర్పఁజాలని కార్యము. ఆ క్రియవలన మేఘమునందుఁ బురుషత్వారోపమును చేయుట తప్పదు. సమాసోక్తియందు మాత్ర మట్టిచిక్కు లేదు. రూపకమందు వలె నిచట అప్రస్తుతమునకే అనుగుణమగు ధర్మ ముపాత్తమై యుండఁ జాలదు. కావున సమాసోక్తియందుఁ బ్రస్తుతమునం దప్రస్తుతము నారోపింప నవకాశము లేదు. మఱియు రూపకమున, "మెఱుపుఁగన్నులు" అనుచోటఁ బ్రస్తుతములు కాని నయనములకుఁ బ్రాధాన్యము కలదు. సమాసోక్తియం దప్రస్తుత వృత్తాంతమునకుఁ బ్రాధాన్యము లేదు. అప్రస్తుతము ప్రధానమయ్యేని రూపకమునందువలె నచటను బ్రస్తుతమునం దప్రస్తుత సమారోప మొనరింప వీలయ్యెడిది. కాఁగా సమాసోక్తియందుఁ బ్రస్తుతమున విశేషణ సమర్పితమగు నప్రస్తుతవృత్తాంత సమారోపమే చారుత్వాధాయక మగును.

సమాసోక్తియందు శ్లిష్టాదులగు విశేషణముల సామర్థ్యమునచే ప్రస్తుతాప్రస్తుత వృత్తాంతములు రెండును తెలియుచున్నవి. విశేషణములు భిన్నపదోపాత్తము లగునపుడు ప్రస్తుతాప్రస్తుతములకు వలెనే యుచిత వృత్తాంతద్వయమునకును తుల్యప్రాధాన్యమున్నది. ఇచటి వృత్తాంతములు రెండును ప్రస్తుత విశేష్యముతోడనే సాక్షాదన్వయమును బొందుచున్నవి. కానఁ బ్రస్తుతము ప్రధానము, అప్రస్తుత మప్రధానము అని చెప్ప వీలులేదు. అపుడు ప్రస్తుతాప్రస్తుతవృత్తాంతములు సమానములే యగును. అట్టియెడ ప్రస్తుతమున అప్రస్తుత సమారోపము చేయ వీలగును. సమాసోక్త్యుదాహరణములలో ప్రస్తుత విశేష్యమునం దప్రస్తుతమున కన్వయ యోగ్యత లేదు. అట్లే యప్రస్తుతమునందుఁ బ్రస్తుతమున కన్వయార్హత లేదు.

సమాసోక్తిలోఁ బ్రస్తుతమునందే యప్రస్తుత వృత్తాంత సమారోప ముచితము. అట్లొనరించినచో చమత్కారము కలుగును.

కాని మీఁదిరీతి నంగీకరించినచోఁ బ్రాచీనలక్షణములు కొన్ని బాధపడవని సందేహము కలుగవచ్చును.

"విశేషణసామ్యమున అప్రస్తుతము గమ్యమైన సమాసోక్తి యగును."

క. "ప్రకృతము విశేషణంబులు
సకలంబులు సామ్యధర్మసహితములై య
ప్రకృతముఁ దలఁపింపఁగ నది
య కృతి సమాసోక్తి యయ్యె నది యెట్లన్నన్"
(నరసభూపాలీయము)

అని ప్రాచీనలక్షణములు. ఇది విశేషణసామ్యమువలన ప్రకృతమునం దప్రకృత సమారోపమునే విధించుచున్నది కాని వ్యవహార సమారోపమును విధించుట లేదు. ప్రస్తుతమునం దప్రస్తుత వ్యవహార సమారోపమే చమత్కారమును కల్గించుటచే విశేషణ సామ్యమువలనఁ గలుగు "నది" మొదలగు నప్రస్తుత పదార్థములను (ధర్మిపదార్థములను) అప్రస్తుత వ్యవహారము గమ్యమానములం జేయ నక్కఱ లేనేలేదు. అచట వ్యవహారమే ప్రధానము కాని ధర్మి ప్రధానము కాదు. కావునఁ బ్రాచీనుల లక్షణములు పై విషయమునకు విరుద్ధము అని శంక కలుగవచ్చును.

పరిశీలించినచోఁ బ్రాచీన లక్షణములు కూడఁ బై విషయమును విరోధింపఁజాలవని చెప్పవచ్చును అప్రస్తుత వృత్తాంతమే ప్రస్తుతమునం దారోపింపఁబడియున్నను, ఆ వృత్తాంత మప్రస్తుత ధర్మిసంబంధము

కలిగియున్నపుడే రాణించును. కేవల విశేషణములు తత్సంబంధిత్వమును తెలియఁజేయఁజాలవు. కావున శ్లిష్టములగు విశేషణములఁగాని, సాధారణములగు విశేషణములఁగాని అప్రస్తుత వృత్తాంతము (నద్యాదివృత్తాంతము) వ్యక్తమైన పిదప నా యప్రస్తుత వృత్తాంతమునకుఁ దత్సంబంధిత్వము (నద్యాదిసంబంధిత్వము) కలుగును. మనము రాజాగారి గుఱ్ఱముఁ జూచి నపుడు గుఱ్ఱముతో సంబంధించిన రాజా మన స్మృతికి వచ్చును. ఆ పిదప గుఱ్ఱమునందు "ఇది రాజాగారిది" అను జ్ఞానము కల్గును. అట్లే యిందును అప్రస్తుత వృత్తాంతమందు విశేషణబలమున వాచ్యమనదగు శోభఁ గలిగించు నప్రస్తుతము కూడ గమ్యమాన మగుట తప్పదు. ఈ విషయమంతయు శ్లిష్టవిశేషణ సమాసోక్తి ననుసరించి వివరింపఁబడినది. ఈ రీతినే తక్కిన భేదములయందును గుర్తింపవలెను. ఆ భేదములందును అప్రస్తుత వ్యవహార సమారోపమే కలదని ప్రాచీనుల యాశయమైనట్లు మన మూహింప వచ్చును. "పిల్లవాయువు నీలనిభవేణుల గుబ్బలమీఁది పయ్యెఁటల జార్చుట" కాముకచేష్టితమైనట్లు వర్ణింపఁబడినపుడు కాముకునందుఁ గూడ నా ధర్మము లుండుటంబట్టి యచట తత్సంబంధి సమారోపము కుదురును. సారూప్యనిబంధన యగు సమాసోక్తియందును ప్రస్తుత వృత్తాంతమువలన గమ్యమగు నప్రస్తుత వృత్తాంతము తెలియుచుండును. అచ్చట అప్రస్తుత వృత్తాంత సమారోపమే కలదని చెప్పక తప్పదుకదా! ఒక భేదమున స్పష్టముగ నప్రస్తుత వృత్తాంత సమారోపము కన్పించు నపుడు ఆ యలంకారమునకే తక్కిన భేదము లట్లు కావని చెప్పి, వానికి వేఱులక్షణములఁ గల్పించుట యుచితము కాదు. కావున నప్రస్తుత వృత్తాంత సమారోపమే సమాసోక్తియందుఁ గలదని చెప్పినను ప్రాచీనుల లక్షణములు నిర్బాధకములే యగును.



## 4. పరికరము

విశేషణము లభిప్రాయ గర్భితములై యున్నచోఁ బరికరాలంకార మగునని చెప్పబడినది. విశేషణము లభిప్రాయ గర్భితములైనచో వ్యంగ్యార్థ మచట నుండి తీరును. కాని యంతమాత్రమున నీ యలంకారము ధ్వని యగునని చెప్ప వీలులేదు. వ్యంగ్యము ప్రధానమగునప్పుడు ధ్వని యగును. వాచ్యము ప్రధానమైనప్పు డది గుణీభూతవ్యంగ్యమగును గాని ధ్వని కాఁజాలదు. ఇచట వ్యంగ్యముకంటె వాచ్యార్థమే చమత్కారముగ నుండుటచే వాచ్యమే ప్రధానమై యున్నది. వ్యంగ్యము వాచ్య పరికరమై (వాచ్యోపస్కారకమై) యుండుటంబట్టి యిది పరికరాలంకార మగుచున్నది.

"ప్రయోజనము లేక విశేషణముఁ బ్రయోగించిన నపుష్టార్థమను దోషము సంభవించును. విశేషణ మెప్పుడును సాభిప్రాయముగనే యుండవలెను. కావున నొక్క విశేషణ మభిప్రాయగర్భిత మైనంత మాత్రమున నే యలంకారమును కాఁజాలదు. అనేక విశేషణము లభిప్రాయ గర్భితములైనప్పుడే యీ యలంకార మగును" అని కొంద ఱందురు.

కాని యిది సరికాదు. ఒక్క విశేషణ మభిప్రాయగర్భితమై యున్నను పరికరము కాఁగలదు. శ్లేషయమకాదిస్థలములందు అపుష్టార్థ దోషము లేనందున నొక్క విశేషణ మభిప్రాయగర్భితమై యున్నను చమత్కారము కల్గుటంబట్టి అచట పరికరాలంకార మగుచున్నది.

సీ. "ఫలభంగములు చేయు చిలుకకు సాంగమై
క్రోధరసంబు ముక్కుననె యుండు"

అను నిట్టి స్థలములఁ బరికింపుఁడు. ఇచటఁ జిలుకకుఁగల విశేషణము ఫలభంగములు చేయుట యొక్కటియే. అది శ్లిష్టపదము. దానికి రసాలా

విఘ్నభంగము, లాభభంగమునని రెండర్థములు కలవు. పరపోత్రిని ధరింపఁజాలక పూఁబోటులేఁగిన గిరిరాజవిని, చెలికత్తె లచటికిఁ బోవుట తప్పని ఖండలించుచున్నారు. ఇచటి చిలుకలు మన లాభమును భంగపాటొనరించు నని వారి యుపదేశము. అచట నీ యర్థము ధ్వనితమగుచున్నది. కావున నిది పరికరమగుచున్నది. ఆ రీతి నే తక్కిన స్థలములందుఁగూడ (అనఁగా శ్లేష యమకములు లేని చోటఁగూడ) కొక్క విశేషణము సాభిప్రాయమైనచో పరికరము కాఁబోదు. ఏకపదార్థ హేతుకమగు కావ్యలింగ మలంకార మగునని యంగీకరింపఁబడినది. అట్లే యొక్క విశేషణ మభిప్రాయ గర్భిత మగునపుడును పరికర మగును.

---

## 6. శ్లేష

ప్రకృతాప్రకృతశ్లేష శబ్దశక్తిమూలధ్వని యగునని ప్రాచీనాలంకారికుల యాశయము. ప్రకృతార్థాతిరిక్తమగు నర్థాంతరము శబ్దసామర్థ్యమున నెచట గమ్యమగునో అది శబ్దశక్తిమూల ధ్వని. కాని శ్లేషలోని రెండర్థములు నభిధేయములే యగుచున్నవి. అనఁగా రెండర్థములను చెప్పుటలో నా యా శబ్దములకు శక్తి కలదు. కావున నభిధవల్లనే యర్థాంతరము లభించుచుండుటచే, నయ్యది వ్యంగ్యమగు ననుట సరికాదు. ఇచట వ్యంగ్యమునకుఁ బ్రయోజనము లేదు. ఇచటి యర్థములు రెండును వాచ్యములే. అట్లయినను ఈ రెండింటికిని గల సామ్యము (అనఁగా ఉపమాలంకారము) ఇచట వ్యంగ్యము కాఁగలదు. ఈ శ్లేషభేదమున ధ్వని కలదని చెప్పిన ప్రాచీనుల మతము నిదియే యనియు (అనఁగా నిచట నుపమాలంకారమే వ్యంగ్యమనియుఁ, గావుననే యిచట ధ్వని యుండవచ్చు ననియు) మన మూహింపవచ్చును. అప్రకృతార్థము వ్యంగ్యమగునని వారి తలంపు కాదు. మఱియుఁ దొలుత శబ్దము ప్రాకరణికమగు నర్థముఁ దెలిపి పిదప నప్రాకరణికమును స్ఫురింపఁజేసినంత మాత్రమున, అప్రకృ

తము వ్యంగ్యము కాఁజాలదు. శక్తి వలననే ద్వితీయార్థప్రతీతి కలిగి యుండుటచే వ్యంజన యచట నిష్ప్రయోజకము. ఈ శ్లేషభేదమునఁ బ్రకృతార్థమునకుఁ బిదప నప్రకృతము తెలియుచుండును. కావున నిది గూఢశ్లేషయనఁ గావచ్చును.

ఈ శ్లేష సభంగశ్లేష యనియు, అభంగశ్లేష యనియు రెండు విధములు. పదములను ఒక యర్థమున నొకవిధముగను, వేఱొక యర్థమున నింకొక రీతిగను విఱిచి చెప్పుట సభంగశ్లేష యగును. అట్లు విఱువనక్కఱలేనిచో అభంగశ్లేష యగును. “వ్యాళారి వీరసేనుని, సత్త్రిశంకు సమాఖ్యుని” మొదలగునవి సభంగములు. మొదటిదానిని నల పక్షమున “వ్యాళారి - వీరసేనుని” అని విఱువవలెను. హరిశ్చంద్రపక్షమున నక్కఱ లేదు. రెండవదానిని హరిశ్చంద్రపక్షమున “సత్ - త్రిశంకు సమాఖ్యుని” అని విఱువవలెను. నలపక్షమున “సత్త్రి - శంకుసమాఖ్యుని” అని విఱువవలెను.

“అన్యపుష్టచయము, పల్లవోత్కరము” అనునవి అభంగములు. అవి రెట్టి విఱుపులను కోరకయే యర్థద్వయమును బ్రతిపాదింపఁగలవు. సభంగశ్లేష శబ్దాలంకార మగుననియు, అభంగశ్లేష యర్థాలంకార మగుననియుఁ గొందఱి మతము. రెండును శబ్దాలంకారములే యగునని మఱి కొంద ఱందురు. రెండు నర్థాలంకారములే యగునని యప్పయ్యదీక్షితుల వారి మతము.

## 6. ప్రస్తుతాంకురము

ఈ యలంకార మన్యాపదేశధ్వని యగునని ధ్వన్యాలోకలోచనకారుని యభిప్రాయము. అభిధ (అనఁగా శక్తి) వాచ్యార్థ మగు నొక దానిని చెప్పినపుడు, అర్థాంతరము వ్యంజనావృత్తివల్లనే లభించును.

కావున నచట అభిధకు శక్తి లేదు. ఇచ్చట అభిధ ప్రస్తుతమగు భృంగ వృత్తాంతము కొఱకు దానినే చెప్పఁగలదు. మఱియొక ప్రస్తుతమగు కాముక వృత్తాంతము వ్యంజనవలననే స్ఫురించుచున్నది. కావున నిది ధ్వని యగునని యతని మతమై యుండవచ్చును. అప్రస్తుతప్రశంసయందు మాత్ర మీ రీతి యుదురదు. అచ్చట వాచ్యార్థము ప్రస్తుతము కానందున అభిధ యచట విశ్రాంతిఁబొందఁజాలదు. కావున నభిధ ప్రస్తుతార్థమునందే (అవాచ్యార్థమునందే) విశ్రాంతిఁబొందవలసియున్నది. అప్పుడది యలంకారము కావచ్చును. ఇచ్చట భ్రమరవృత్తాంతము ప్రస్తుతమగుటచే నభిధయందే విశ్రాంతమగును. కాముకవృత్తాంత మభిధచేఁగాక వ్యంజనచేతనే తెలిసికొన వీలగును. కావున నిది ధ్వని యగునని లోచనకారుఁడు నిరూపింపవలసి వచ్చెను.

పరిశీలించి చూచినచో నిది ధ్వని కాక యలంకారమే యగునని చెప్పవలసియున్నది. ఇచట భృంగవృత్తాంతము ప్రస్తుతమేయైనను కోరిన ముఖ్యవృత్తాంతము కాముకసంబద్ధమైన దగుటచేత, అభిధ భృంగవృత్తాంతమును మాత్రమే చెప్పఁగలదని యెంచక కాముకవృత్తాంతమును కూడ చెప్పననుట ఉచితము. కావున నిది యలంకారమే యగును గాని ధ్వని కాఁజాలదు.

## 7. వ్యాజస్తుతి

ఒకదాని స్తుతివలన వేఱొకదానికి నింద కల్గినచో వైదగ్ధ్యశ్రీ రూపమగు సామాన్యనిబంధనాప్రస్తుతప్రశంస యగునని అలంకారసర్వస్వకారుఁడు చెప్పియున్నాఁడు. ఒకదాని స్తుతివలన నింకొకదాని నింద గమ్యమానమగుటయే యప్రస్తుతప్రశంస యనియు, కార్యకారణసంబంధమున్నచో నప్రస్తుతప్రశంస కాఁజాలదనియు దండ్యాచార్యుల మతము. దాని కుదాహరణముగ నతఁడు "ఒకరిని సేవింపక లేళ్లు వనమున హాయిగ

జీవించుచున్నవి" అనుదాని భావము. ఇచట హరిణస్తుతివలనఁ బరుని సేవించువాని జీవన మధన్యమను నింద వ్యక్తమగుచున్నది.

కాని వారిమతము లుచితములు కావు. వ్యాజస్తుతియందు అప్రస్తుత ప్రశంసయందువలెఁ గేవలము అప్రస్తుతమువలనఁ బ్రస్తుతావగమనమే కలుగదు. విశేషముగ స్తుతియు, నిందయు గల్గుచుండును. అప్రస్తుత ప్రశంసయందు స్తుతినింద లుండవలె ననునియమము లేదు. కొంత చమత్కృతి యుండుటంబట్టి అన్య స్తుతి నిందలవలన, అన్య నిందాస్తుతులు వ్యక్తము లగునప్పుడు వ్యాజస్తుత్యలంకారమే యగు నని చెప్పుట లెస్స. ఇది యప్రస్తుతప్రశంసయే యైనచో ఒకదాని నిందాస్తుతులవలన దాని స్తుతినిందలే యభివ్యక్తము లగునప్పుడుకూడ నప్రస్తుత ప్రశంసనే యంగీకరింపవలసివచ్చును. అప్పుడుఁగూడ అప్రస్తుతము అగు నిందాస్తుతులవలనఁ బ్రస్తుతము లగు స్తుతినిందలు వ్యక్తము లగుచున్నవి గదా! కావున అలంకార సర్వస్వకారాదిమత మాదరణీయమైనది కాదు.



## 8. వ్యాజనింద

అన్యస్తుతివలన నన్యస్తుతియు, అన్యనిందవలన నన్యనిందయు వ్యక్తము లగునప్పుడు క్రమముగ వ్యాజస్తుతి వ్యాజనిందాలంకారము లగు నని చెప్పఁబడుచున్నది కాని యిచట స్తుతి నిందారూపములగు నప్రస్తుతములవలనఁ బ్రస్తుతావగతి కలుగుచున్నందున నివి యప్రస్తుత ప్రశంసకే కావలసి యున్నది. కాని, యిదివఱకు (వ్యాజస్తుతిలో) చెప్పిన చొప్పున అప్రస్తుత ప్రశంసయందుకంటె వీనియందు స్తుతి నిందారూప విశేషము లుండుటవలన నివి దానియం దంతర్భవింపఁజాలవు.

కాని యప్రస్తుతములగు స్తుతినిందలవలనఁ దద్విరూపములగు ప్రస్తుత వృత్తాంతములు వ్యక్తములగుట అప్రస్తుతప్రశంసాలంకారమునను గలదు.

సాదృశ్య నిబంధనాప్రస్తుత ప్రశంసయొక్క యుదాహరణమునందు "ఆలోపల నచేతరంధ్రముల్ గాముడుమిగిరే" యనుచో నప్రస్తుతనింద వలనఁ బ్రస్తుతనింద వ్యక్తమగుచున్నది. కావున నీఁది యలంకారము నందు అప్రస్తుతప్రశంస కూడఁ గలదని చెప్పవలెను. దానికంటె దీని యందు విశేష మున్న కతమున నా యలంకారములు నుండవచ్చును. కాని యప్రస్తుతప్రశంస లేదని మాత్రము చెప్ప వీలు లేదు. పరిశీలించిచూడఁగా నిందవలన నిందయు, స్తుతివలన స్తుతియుఁ గలుగుటయే యుచ్చటఁ జమత్కారాధాయక మగుటచేఁ గ్రమముగ వ్యాజనింద, వ్యాజస్తుతి యను అలంకారము లగుట యుచితము.

వ్యాజనిందాలంకారము వ్యాజనింద గల యప్రస్తుతప్రశంసా లంకారమవలెనే వ్యాజస్తుత్యలంకారము వ్యాజస్తుతి గల యప్రస్తుత ప్రశంసాలంకారము గలదు.

ఉదాహరణము —

తలఁపఁడుసొంపువెచ్చమునఁదార్కొనునష్టముకష్టమెంచఁడే
తెఁపునులేని మానవునెడన్ మదనవ్యాపీడఁగూర్చి, నీ
కలికియు నీడుజోడయిన కాంతుఁడు లేక తపించుచున్న దే
తలఁపు మనంబునందిడి విధాత సృజించెనొ యీ తలోదరిన్.

ఇచట నాయికావృత్తాంత వర్ణన మప్రస్తుతము. నాయికయొక్క సృష్టి నిందా వ్యాజమువలనను, నాయికా నిందా వ్యాజమువలనను నాయిక యొక్క సౌందర్యప్రశంస గోచరించుచున్నది. దీనివలనఁ బ్రస్తుత మగు నొక కవియొక్క స్వకవితావృత్తాంతము సూచిత మగుచున్నది. కవియొక్క స్వకవితాసృష్టినిందావ్యాజమునను, కవితానిందావ్యాజమునను కర్తృ

చమత్కారాతిశయ ప్రశంస వ్యక్తమగుచున్నది అనఁగాఁ గాంతాస్తుతిఁబలెఁ గవితాస్తుతి వ్యక్తమగుచున్నదని తెలిసెడి.

ఈ పద్యమునకు వాచ్యమగు కాంతావర్ణన వృత్తాంతమునఁ దాత్పర్యము లేదు. ఇట వాచ్యార్థతాత్పర్యమే ముఖ్యమైనచో నీ పద్యము వీతరాగునియొక్కగాని, సరాగునియొక్కగాని వచనమై యుండవలెను. ఈ యిరువురిలో నెవ్వరు నిట్లు తలంపరు. వీతరాగునకిట్టి కాంతావిషయ విచారము కలుగదు. అట్లతఁడు తలంచిన హాస్యాస్పదుఁడు కాఁగలఁడు. రాగి యగువాఁడు కలికిఁ దానే యీమెకో డగుదునని తలంచును గాని, యీమెకో డగువాఁ డెవ్వఁడును లేఁడని తలంపఁడు. అట్లు తలఁచిన నతఁడు పశుప్రాయుఁ డగును. కావున దీని కప్రస్తుతార్థమునందే తాత్పర్యము కలదని చెప్పవలెను. అందువల్లనే "వాచ్యాసంభవమున నప్రస్తుత ప్రశంస యగు" నని చెప్పిన ప్రాచీను లీ పద్యము నప్రస్తుతప్రశంసోదాహరణముగఁ దీనిఁగొని యుండిరి.

## ౯. సమము

ఇందలి మూఁడవ భేదమున కుదాహరణ మగు "వారణలాభముఁ గోరంగా" అను పద్యము విషమాలంకారోదాహరణము కాఁజాలదు. అనుకొనని యనిష్టము కలిగినచో విషమ మగును. ఇచట శ్లేషమహిమవలన ఇష్టప్రాప్తియే కలిగినట్లు వర్ణింపఁబడి యున్నది. శ్లేష కలిగించోట్ల అనుకొనని రీతి ఉత్కటమగు ననిష్ట మున్నను సమాలంకారమే యగును గాని విషమము కాఁజాలదు.

## 10. సమాధి

ఈ యలంకారము ద్వితీయ సముచ్చయభేదమునకుఁ బ్రతిద్వంద్వి యగుచున్నది. అచటఁ బ్రత్యేకముగ సమర్థములగువానికి ఖలేకపోత న్యాయమున ఒక్కసారిగఁ గార్యసాధకత్వ ముండును. (కల్లమునం దొక్కసారిగఁ బావురములన్నియు వ్రాలు రీతి ఖలేకపోతన్యాయము) సమాధియం దా రీతిగఁ గాదు. ఒక కార్యము నారంభింప కాకతాళీయ న్యాయమునఁ దటస్థించిన కారణ మందుఁ గార్యసౌకర్యాధాయక మగు చుండును. (అనుకొనకుండఁ దటస్థించురీతి కాకతాళీయన్యాయము) సముచ్చయాలంకారమునఁ గారకములకుఁ దుల్యకక్షత్వముండును. సమాధియం దా రీతిని కాక ఒకదాని తరువాత మఱియొకటి సమన్వయము నకు వచ్చును.

---

## 11. కావ్యలింగము

ఒక యర్థమును సమర్థించుటలో వాక్యార్థపదార్థములు హేతువు లగునప్పు డవి అభిప్రాయగర్భితములై యుండక తప్పదు. ఇదివఱలోఁ జెప్పిన పరికరాలంకారము కూడ సాభిప్రాయవాక్యార్థ పదార్థ ఘటనము నకే చెందును. కావునఁ గావ్యలింగ పరికరములకు భేదము లేదని శంకింప వీలు కలదు. కాని పరికరాలంకారమున వాక్యార్థ పదార్థము లవలనఁ గల్గు వ్యంగ్యార్థమే హేతు వగును. ఇచట వాచ్యార్థమే హేతు వగును. కావున మీఁది యలంకారద్వయమునకుఁ బరస్పరము భేదము కలదని చెప్పవచ్చును

కాని మీఁది సమాధాన మంత యుక్తమైనదిగఁ దోఁచదు. కొన్ని యుదాహరణములందలి పదార్థవాక్యార్థములు వాచ్యములై హేతువు లగుచుండుట కనఁబడఁగలదు కాని కొన్నిచోట్ల కావ్యలింగమునందును వ్యంగ్యార్థమే హేతు వగునని చెప్పక తప్పదు. చూడుఁడు—

గీ. విదుషి యీ యింతి తలఁదాల్పు వెంట్రుకలను
నహహా! యెబ్భంగి సాటి సేయంగవచ్చుఁ
బశువుచేతఁ బురస్కృతిఁ బడయలేక
చాపలంబున వర్తించు చామరములు.

(శృంగారనైషధము)

ఇందు వ్యంగ్యార్థములు హేతువులు కావని చెప్ప వీలులేదు. ఇచటఁ జామరములు దమయంతి కేశముల సాటికావని చెప్పుటలో "విదుషి యగు నా దమయంతి వానిని తలఁదాల్చుట"యుఁ, "పశువు చామరములను (పురస్కరింపక) కాలక నుంచుకొని చాపలమున వర్తించుటయు హేతువులగుచున్నవికదా! ఇచట "పశువు" అను పదము "విదుషి" అను దానికిఁ బ్రతిద్వంద్వి యగుటచే పశువనఁగా నవివేకి యను నర్థమును గ్రహింపవలసి యున్నది. అది వ్యంగ్యమగుట నిస్సంశయము. కావున నిది పరికరమున సంతర్భవింపఁగలదని తోఁచఁగలదు.

కాని కొన్నింటియందు వ్యంగ్యార్థము హేతు వగునంతమాత్రమున నన్ని కావ్యలింగములును పరికరములే యనుట సరి కాదు. వ్యంగ్యార్థము హేతువుగాఁగల కావ్యలింగమైనను, పరికర మనుటకంటెఁ బరికరోత్థాపిత మగు కావ్యలింగమని యనుటయే యుచితము.

మీఁది యుదాహరణమున "పశు" వనునప్పుడు అవివేకము వ్యంగ్యము. పశువుచేఁ బురస్కృతిని బడయకుండుట యను హేతువు వాచ్యము. ఈ వాచ్యార్థము హేతువగునప్పుడు నదియు వ్యంగ్యార్థ మపేక్షితము కాదు. వ్యంగ్యార్థము లేకపోయినను అచట హేతుత్వము సిద్ధించును. పరికరాలంకారమున మాత్రము వ్యంగ్యార్థము కావలెను. "ఘం భంగములఁ జేయు చిలుకల సాంగమై క్రోధరసంబు మిక్కుటమై యుండు"

నను పదార్థహేతుక పరికరాలంకారమునఁ బ్రతీయమానమగు లాభభంగము నంగీకరించి తీరవలెనుగదా! ప్రతీయమానము లేకున్నఁ బరికరము కుదురనే నేరదు. "పసువుచేతఁ బరస్పృతిఁ బడయలేక" అనుచోటఁగల వ్యంగ్యార్థము వాచ్యమునకు సొగసొసఁగుటచేత నదియు(వాచ్యము)హేతువగుటలోనే యుపయోగించుచున్నది. కావున నచటఁ గావ్యలింగమే ప్రధానమనియుఁ బ్రతీయమానము దాని యంగమనియుఁ దెలియుచున్నది.

## 12. అర్థాంతరన్యాసము

అర్థాంతరన్యాసాలంకారములోని యుదాహరణములలోఁ గ్రమముగ నప్రస్తుతములగు సామాన్యవిశేషములు ప్రస్తుతములగు విశేష సామాన్యములను బలపరింపఁగలవో విచారింపవలసి యున్నది. ప్రస్తుతమునకు నది యుపకరింపనిచో నిష్ప్రయోజకము అని చెప్పవలసి యుండును.

ఇచ్చటి యప్రస్తుతము, అప్రస్తుతప్రశంసాలంకారమందువలెఁ బ్రస్తుత వ్యంజకము కాఁజాలదు. ఆ యలంకారమునందుఁ బ్రస్తుతము చెప్పఁబడి యుండదు. అర్థాంతరన్యాసమునఁ బ్రస్తుతము కూడ శబ్దోపాత్తమై (వాచ్యమై) యుండును.

ఇట్టిది యనుమానాలంకారమని శంకింప వీలులేదు. అందప్రస్తుతము ప్రస్తుతప్రతీతిజనక మగుచుండును. ఆ మార్గమిచట లేదు. మఱియు ననుమానమందువలె నిచట వ్యాప్తి, పక్షధర్మత మొదలగునవి లేవు.

దృష్టాంతాలంకారమున నప్రస్తుతము ప్రస్తుతమున కుపమాన మగుచుండును. ఈ యలంకారమునఁ గూడ నట్లే అప్రస్తుతము ప్రస్తుతోపమానమగునని చెప్ప వీలులేదు. అర్థాంతరన్యాసమున నెక్కడేని సామాన్యమునకు విశేష ముపమానమై యుండవచ్చును కాని సామాన్యము

మాత్రము విశేషమున నుపమానము కాఁజాలదు. ఉపమానము కాఁజాలని సామాన్యమును నిబంధించి యుపమానముగ వర్ణించుట యుక్తము కాదు. కావున నీ యలంకారమునందలి యప్రస్తుతము ప్రస్తుతమును సమర్థించుట యందే యుపయోగింపఁబడి యున్నది. అట్లగుటచే నిది వాక్యార్థహేతుక మగు కావ్యలింగాలంకారమునందే యంతర్భవింపఁదగి యున్నది.

కొందఱిచట నొక సమాధానముఁ జెప్పుదురు. సమర్థింపఁబడిన యవశ్యకత యున్నపుడు సమర్థించినచోఁ గావ్యలింగ మగునని యు, సమర్థనాపేక్ష లేకున్నను సమర్థించినచో నర్థాంతరన్యాస మగునని యు వారి యభిప్రాయము. “అనయము నీకుచూడ్కి కనయా వలకల్యయు నీటముంచె” అను కావ్యలింగోదాహరణమున సమర్థనము కావలసియున్నది. “వనితయొక్క పోలికగల వస్తువు దుర్లభమయ్యె” ననునపుడు నీఁడి సమర్థనము లేనిచో కొఱరదు

౮. కాఁటివలన దివాభీతము

కరణిఁ గవులఁ జొచ్చు తమముఁ గాచు నతఁడొ
శరణాగతుఁ డనదైనను
దొరల కెపుఁడు మమత కోవిదునియందుఁ బలెన్.

(నిర్వచనకుమారసంభవము

అను నీఁడి యర్థాంతరన్యాసమున విశేషమునకు సామాన్య సమర్థనాపేక్ష లేదు. అట్లపేక్ష లేకున్నను, ఇచట సమర్థనము కలదు. కావున నీదిరీతిని కావ్యలింగార్థాంతరన్యాసములకు భేదమును గుర్తింపవలెనని వారి మతము.

కాని పై వాదము సముచితము కాదు. సమర్థనము నపేక్షించు నర్థాంతరన్యాసములును, సమర్థనము నపేక్షింపని కావ్యలింగములును గలవు. విశేషము ప్రస్తుతమగునేని దానిని సమర్థించుటకు సామాన్య మక్కఱ లేదు. కాని సామాన్యము ప్రస్తుత మగునపుడుమాత్రము దానిని సమర్థించుటకు విశేష మవశ్యముగ నుండవలెను. సామాన్యము ప్రస్తుత మగుచో

విశేషము దానివెన్నంటి యుండి తీరును. "విశేషము లేని సామాన్యము లేదు" అని శాస్త్రసిద్ధమగు సిద్ధాంతము.

క. రూపము గలచోఁ గాప
  వ్యాపారం బుండదనెడి వాక్కు నిజంబే
  నీ పావనమగు రూపం
  బో పార్వతి! మునులకైన నొజ్జ యగుఁగదే
(నిర్వచనకుమారసంభవము)

ఇందలి మొదటి సామాన్యము, రెండవదగు విశేషముచే సమర్థింపఁ బడకున్నచో బుద్ధికెక్కుట దుర్ఘటము. కావుననే విశేషముచే సామాన్యము సమర్థింపఁబడునపుడు సమర్థకమగు విశేష మర్థాంతరన్యాసమున కపేక్షితమే యగుచున్నది. అయినను "ధర నెచటఁ బరీక్షకగణ మరయఁగ లేదచట మణు లనర్ఘములు" అను మొదలగు స్థలములందు సామాన్యము ప్రస్తుతమైనను, అది విశేషముచే సమర్థనము నపేక్షింపలేదు. కాని అంతమాత్రమున సామాన్యము లన్నియు నిట్లే విశేషసమర్థనాపేక్షారహితములై యుండునని చెప్పను వీలులేదు. లోకప్రసిద్ధములు కాని సామాన్యములు కొన్ని కలవు. వానిని సమర్థించుట యవసరము. "పొగయున్న చోట నగ్నియుండును" అను వ్యాప్తి సామాన్యమునకు "వంటయింటి వలె" అను విశేషరూపమగు దృష్టాంతము నీయకున్నను అది బుద్ధిస్థమగుచున్నది. అంతమాత్రమున నప్రసిద్ధవ్యాప్తికిఁగూడ దృష్టాంతము నీయ నక్కఱలేదని చెప్ప వీలుపడదుకదా! కావున సామాన్యమునకు విశేషాపేక్ష కలదని చెప్పవలెను.

కొన్ని సామాన్యములు లోకప్రసిద్ధములు కావని చెప్పఁబడి యున్నది. విశేషము ప్రస్తుతమై సామాన్య మప్రస్తుత మగునపుడు, లోకప్రసిద్ధము కాని యా సామాన్యము విశేషమును సమర్థించు టెట్లు? అట్టి స్థలములందా సామాన్యమును సమర్థింప వేఱొక విశేషము కావలసి యున్నది కదా! అని యొక సందేహము కలుగవచ్చును. నిజము. అట్టి

చోట్ల విశేషాంతర మవసరమే! అప్రస్తుతమగు సామాన్యమును సమర్థింప విశేషాంతరమును జెప్పినచో నది వికస్వరాలంకార మగునని యాలంకారికు లొప్పుకొనుచునే యున్నారు. అది కూడ అర్థాంతరన్యాసము వెంబడికే వివరింపబడినది. కావున నర్థాంతర న్యాసమునకుఁ గూడ సమర్థనము కావలె నని తేలినది.

కావ్యలింగాలంకారమునకుఁగూడఁ గొన్నిచోట్ల సమర్థనాపేక్ష లేదు. "విదుషీ యాయింతి తలఁదాల్చె నింద్రుశాప" మొదలగు స్థలములలో సమర్థన మక్కఱలేదు. ఉపమానవస్తువు లుపమేయవస్తువులకంటె హీనములగుట కవిలోక ప్రసిద్ధము. కావున దమయంతి కేశములకుఁ జామరములతోడి సామ్యము లేకుండుట ప్రసిద్ధము. కావున నా సామ్యాభావమును వేఱుగ సమర్థింప నక్కఱలేదు. అరీతినే—

గీ. విషముచే హేతిచే జాతవేదుచేత
మిత్తిచేఁగాదు పడఁతి యుత్పత్తిఁ గనుట;
అప్రతీకారపరుషమై యలరుకతనఁ
బసఁతిచేతనె సృజియింపఁబడుట నిజము.

అను కావ్యలింగవిషయపద్యమున గ్రహింపవలెను. ఇచట స్త్రీని విషాదులచే నిర్మింపఁబడలేదంట లోకసిద్ధము. లోకసిద్ధమైనదానిని తిరిగి "అప్రతీకార పరుషమై యలరుకతన" అని సమర్థింప నవసరము లేదు. కావునఁ గావ్యలింగమునను సమర్థనాపేక్ష లేకుండుట కలదనియు, నర్థాంతర న్యాసమునను సమర్థనాపేక్ష కలదనియు నొప్పుకొనవలెను.

పై విషయములఁబట్టి సమర్థనాపేక్షయున్నఁ గావ్యలింగమనియు, నది లేకున్నను సమర్థించిన నర్థాంతరన్యాసమగుననియుఁ జెప్పుట యుక్తము కాదు. సమర్థ్యసమర్థకములకు సామాన్యవిశేషరూపసంబంధ మున్న నర్థాంతరన్యాసమనియుఁ, దదితరసంబంధ మున్నఁ గావ్యలింగ మగుననియు వచించుట యుచితము.

## 13. లలితము

ఈ యలంకారమునఁ బ్రస్తుత వృత్తాంతము కాక అప్రస్తుతవృత్తాంతమే వర్ణింపఁబడుచున్నది. కావున దీని నప్రస్తుతప్రశంసలో నంతర్భవింపఁ జేయవచ్చునని తోఁచవచ్చును. కాని అందు విశేష్యముకూడ నప్రస్తుతమగును. ఇచట విశేష్యము ప్రస్తుతమై వృత్తాంతమాత్ర మప్రస్తుతమగుచుండును. ఇట్లు రెండిటికిని భేదము కలదు.

ఇది సమాసోక్తియుఁ గాఁజాలదు. సమాసోక్తియందు ప్రస్తుతవృత్తాంతముచేత నప్రస్తుతము గమ్యమగును. ఇచట అప్రస్తుతముచేతఁ బ్రస్తుతము గమ్యమగుచుండును.

ఇట్లే నిదర్శనయుఁ గాఁజాలదు. ప్రస్తుతాప్రస్తుత వృత్తాంతములు రెండును గ్రహింపఁబడి, యా రెండిటికి నైక్యము చెప్పఁబడినప్పుడే నిదర్శన యగును. లలితమున అప్రస్తుతవృత్తాంతము మాత్రమే గ్రహింపఁబడును. ప్రస్తుతవృత్తాంతము గ్రహింపఁబడదు. కావున లలితమునకును, నిదర్శనకును భేదము కలదు. విషయవిషయులుగ ప్రస్తుతాప్రస్తుతవృత్తాంతములు గ్రహింపఁబడినప్పుడే ప్రవర్తించు నిదర్శనాలంకారము, అప్రస్తుతవృత్తాంతము మాత్రమే యుండు లలితాలంకారమును భిన్నములు కావని తలఁచినయెడల, భేదమున్నను భేదములేనట్లు వర్ణించెడి యతిశయోక్తియును రూపకమే కావలసివచ్చును. ఏలయన— అతిశయోక్తియందు లలితమునందువలె విషయిమాత్రమే యుండును. రూపకమున విషయమును, విషయికూడ నుండును. చూడుఁడు—

ఉపమానోపమేయముల కభేదమును చెప్పిన రూపక మగును. ‘నీ ముఖము చంద్రుఁడు” అని యుదాహృతి. ఇచటఁ జంద్రముఖములకు భేదమున్నను అభేద మారోపింపఁబడినది. కావున నిది సంబంధాతిశయోక్తియే యగునని చెప్పవలసి వచ్చును. కావున నీఁది వాదము సరియైనది కాఁజాలదు.

ఈ లలిత మతిశయోక్తియందే యంతర్భవించునని కొందఱి మతము. ఇచటఁ బ్రస్తుతమును గప్పిపుచ్చి యప్రస్తుతమునే చెప్పియున్నారు. కావున భేదమున్నను నభేదము చెప్పుటచే నిది యతిశయోక్తి కాఁగలదు. కాని యిట్లు చెప్పినచో సారూప్యనిబంధన యగు నప్రస్తుతప్రశంసయు, నీ లలితము నొక్కమాదిరిగ నుండుటచే నదియు నతిశయోక్తియందే యంతర్భవింపవలసివచ్చును.

ఇచట నొకశంక కలుగవచ్చును. అతిశయోక్తియందును, లలితమునందును ప్రస్తుత విశేష్యము లుండును. అప్రస్తుత ప్రశంసయందుఁ బ్రస్తుతమగు విశేష్యము లేదు. కావున నప్రస్తుతప్రశంస అతిశయోక్తి యందుఁ జేరదుకదా!

రూపకాతిశయోక్తియందుఁ బ్రస్తుతవిశేష్యము లేదు. అట్లు లేకున్నను లక్షణావృత్తి ననుసరించి యప్రస్తుతములగు నుపమానము లచటఁ బ్రస్తుత విశేష్యకములు అగుచుండును. ఆ రీతినే అప్రస్తుత ప్రశంసయందలి యప్రస్తుతముకూడఁ బ్రస్తుతగమక మగుటచే నది యతిశయోక్తియే కావలసివచ్చును.

కాని యతిశయోక్తియందు లక్షణావృత్తి యుపయోగించును గాని సారూప్యనిబంధనాప్రస్తుతప్రశంసయందుపయోగింపదు. అందుఁ బ్రస్తుతాప్రస్తుత వృత్తాంతములు సమానములగు రూపము కలవగుటచే, అప్రస్తుతము వలనఁ బ్రస్తుతము గమ్యమగుచుండును. అచట లక్షణకుఁ బ్రవృత్తియే లేదు. కావున నీరీతిని, అతిశయోక్తికిని, అప్రస్తుతప్రశంసకును భేదము కలదని చెప్ప వీలుకలదని తోఁచును. ఆ రెండింటికిని భేదము నంగీకరించినచో లలితముకూడ నతిశయోక్తికంటె నన్యమగునని చెప్పవలెను. అతిశయోక్తి యందువలెఁ గాక యిచటఁ బ్రస్తుతగతమగు నప్రస్తుత వృత్తాంతమువలనఁ బ్రస్తుతమగు వాక్యార్థము గమ్యమగుచుండును. ఇట్లీ రెండింటికిని భేదము సుస్పష్టము.

శయోక్తికంటె తేలుచున్నది. అం తప్రస్తుతవిశేష్యము కానరాదు. అట్లే యీ లలితము అసంబంధమున సంబంధమున్నట్లు వర్ణించు నతిశయోక్తియుఁ గాఁజాలదు. ఇట్లు లలితము సర్వాలంకారవిలక్షణమని తేలుచున్నది.

## 14. లేశము

ఇది వ్యాజస్తుతి యని శంకింపరాదు. ఇచట పక్షులయొక్క స్తుతి వ్యాజమున నిందగాని, చిలుకలయొక్క నిందచే స్తుతిగాని వివక్షితములు కావు. పుత్రుని పాలించుటయం దెక్కువ మక్కువ గల తండ్రి దోషగుణములను గుణదోషములుగాఁ బరిగణించుటయే యిచటఁ బ్రస్తుతము. నిందాస్తుతులచే సంకీర్ణములు కాని లేశములును, గుణదోషవిషయ సంకీర్ణములు కాని వ్యాజస్తుతులును గలవు. కావున నొకదానియం దింకొకటి యంతర్భవింపఁజాలదు. లేశమునం గల గుణదోషవిషయము వ్యాజస్తుతి రూపముగ నున్నచో నచట నీ రెండలంకారములకును సంకరము కలుగును; కాని యొకదానియందుమాత్రము వేఱొకటి యంతర్భవింపదు.

## 15. అతద్గుణము

ఒకదానిగుణమువలన వేఱొకదానికి గుణము కల్గుట యుల్లాసమనియు, ఒకదానిగుణమువలన వేఱొకదానికి గుణము కలుగకుండుట అవజ్ఞయనియు నిదివఱలోఁ జెప్పఁబడియున్నది. కావున తద్గుణాతద్గుణములు క్రమముగ నీరెండిటియందు నంతర్భవింపఁగలవని శంక కలుగవచ్చును కాని యుల్లాసలక్షణమునందును, అవజ్ఞాలక్షణమునందును గల గుణశబ్దము దోష ప్రతిపక్షవాచకము. కావున అన్యగుణమువలన వేఱొకచో గుణోదయమున

## 18. విధి

విధ్యుదాహరణము "చిల్క చిల్కగఁ జూపు"-అందలి "చిలుక" మొదలగు పదములు స్వార్థమున నుపయోగింపక వ్యంగ్యరూపమగు నర్థాంతరమున సంక్రమించుచున్నది. వాచ్యార్థము ప్రస్తుతానుపయుక్తమై వ్యంగ్యార్థమునఁ బర్యవసితము అగుచుండుటంబట్టి దీని నర్థాంతర సంక్రమితము నాఁ బేరు కలిగినది. కావున నిది ధ్వని యను సందేహము కలుగవచ్చును. "నీవు మాటలు నేర్పి తెమ్మిగోఁ ద్రోచిన చిల్కయే చిల్కగు" ననుచో వ్యంగ్యము గుణీకృతమగుచున్నది. వ్యంగ్యము ప్రధానమైనచో ధ్వని యగును. వాచ్యాపస్కృతమగు వ్యంగ్య మలంకారమే యగును. ఆ యభిప్రాయముననే యిది యలంకారములలో నుదాహరింపఁబడినది. ఇట్టి ప్రతిషేధాలంకారమునందును గ్రహించునది.



# అనుబంధము

## II

## సంకేతపద వివరణము

అంగము—విశేషణము, అప్రధానము.

అన్యాపదేశధ్వని—ప్రస్తుతేతరములొక్క మీద కలిసియుండు ధ్వని. చూ. ధ్వని.

అపుష్టార్థము—ఒకదోషము; అర్థము చక్కగ పోషింపబడకుండుట. (శా. అర్థచమత్కృతి లేకుండుట.)

అప్రస్తుతము—ప్రస్తుతము కానిది; "ముఖము చంద్రునివలె ఉన్నది" అనునపుడు ముఖవర్ణనమే ప్రస్తుతము. "చంద్ర" పదము అప్రస్తుతము. దీనికే—ఉపమానము, అప్రకృతము, అవర్ణ్యము, విషయి అని నామాంతరములు.

అభంగము—చూడు పుట 180.

అభిధ—వాచకమను శబ్దమునకు వాచ్యమను అర్థమును కలుగఁజేయు వ్యాపారము. దీనికే శక్తియనియు పేరు.

ఆధారము—ఇతరమునకు ఆశ్రయమగునది. ఆశ్రయమనియు దీనికే పేరు.

ఆధేయము—ఒకదాని నాశ్రయించునది; ఆశ్రయి.

ఆభాస—తొలుత విరోధము స్ఫురించుట—ఆలోచింపఁగా విరోధము కానరాకుండుట.

ఉపమేయము—వర్ణనయందు ప్రస్తుతమగునది. "ముఖము చంద్రునివలె నున్నది" అనునపుడు "ముఖము" ఉపమేయము. దీనికే ప్రస్తుతము—ప్రకృతము—వర్ణ్యము—విషయము అను నామాంతరములు కలవు.

# అనుబంధము

## III

## ఉదాహృత గ్రంథసూచిక

## చాటువు





